"అవును. అది వాడి."

"ఫరవాలేదు" అంటూ సరోజని ఆ లేఖ పూర్తిగా చదువుతుంది.

శర్మ చిరునవ్వుతో మెల్లగా అన్నాడు "సుందరం వ్రాశాడు—"

"అవును సంతకమునుబట్టి తెలుస్తోంది, ఫోర్జరీ అయితే తప్ప."

"ఎన్నాళ్ళయింది అతను వచ్చి, ఒక్క జాబైనా వ్రాసి. కాని అతని మంచితనంలో స్నేహభావంలో నాకు విశ్వాసం ఉంది. చూడు, ఈమారు నిన్ను ఉద్యోగానికి దరఖాస్తు పెట్టమన్నాడు."

సరోజని ఉత్తరం మరల చదివి, "అవును ఇందులోని విషయం చాలా చక్కగా పారాఫ్రేజ్ చేశారు" అంది.

కొన్ని వెలుగులేని కాంతిరేఖలు, ఆశాకిరణాలు, ఆమె ముఖములో ఆ క్షణాన వికసించినాయి. కనులనుండి రాలే వేడి నీటి బిందువును తుడుచుకోవటం కూడా విస్మరించిన సరోజని తటాలున త్రుళ్ళిపడింది వాకిటిలో కారు చప్పుడు విని.

సరోజని, శర్మ, వీధి తలుపువైపు వెళ్ళారు. సుందరం వచ్చాడు.

శర్మ చేయి ఊపుతూ సుందరం అన్నాడు, "ఆహా మా సరోజని కూడ ఇక్కడనే ఉన్నదే!" "ఇప్పుడే వచ్చింది. అదృష్టవశాత్తూ నీవు ఈ వేళకే వచ్చావు సుందరం. నీ ఉత్తరం అందింది."

"అదిగో అందినట్లు తెలుస్తూనే ఉంది." అంటూ సుందరం సరోజనివైపు చూశాడు. ఆమె పెదవి కొరుక్కొని ఆ ఉత్తరం ప్రక్కనున్న టేబిల్ మీద పెట్టింది.

సుందరం మొదలుపెట్టాడు. "ఏం శర్మా, నీకు నా ప్రవర్తన వింతగొల్పి ఉంటుంది. సరోజనికి ఉద్యోగం ఎందుకీయలేదో యిన్నాళ్లుగా చెప్పని కారణం చెప్పమంటావా?"

"నీయిష్టం. నా అంతట నేనే ఎందుకు అడగాలి?"

సరోజనివంక చూస్తూ సుందరం అన్నాడు, "బహుశా ఆమెకు వినాలని కుతూహలంగా ఉండి ఉంటుంది."

సరోజని ఓరకనులతో వెంటనే పలికింది, "శర్మగారికి చెప్ప తలచుకోనిది నాకుమాత్రం దేనికండీ?"

సుందరం నవ్వుతూ, "విను శర్మా. ఆమెకు ఉద్యోగంరాని కారణం నీవు."

నిర్ఘాంతపోయినట్లు, శర్మ తలఎత్తాడు. తటాలున సరోజని వంక చూశాడు. సరోజని ముఖం క్షణము మబ్బుల వెనుక చంద్రునిలా చంద్రుడు లేని పద్మంలా అయిపోయింది.

అర్థంకాని తెల్లదనంతో సుందరం కనుకోణాలు సరోజని వంక తిరిగినాయి. "శర్మా, నీవు శంకరాన్ని ఎరుగుదువు కాదూ?"

"ఆఁ....ఆవేళ మన పార్టీకి వచ్చాడు."

"ఆఁ. అతడే. ఏమనుకుంటావు అతనిని గురించి?"

శర్మ ఏమి జవాబు చెప్పలేదు. సరోజని ముఖంమాత్రం వాడిన పూవులాగ వ్రేలవేసింది.

"నీవేమనుకున్నా ఫరవాలేదు శర్మా. సరోజనికి మాత్రం సుందరం అంటే అసహనం."

సరోజని కోపంతో నిట్టూర్చి రెక్కలు లాగిన పక్షిలాగ కెవ్వన అరిచింది, "నాకు అవసరంలేని వ్యక్తులనుగురించి నాకు ఉండీ లేని అభిప్రాయాలతో మీ కెందుకండీ?"

"సరోజనీ, గాలివేస్తోందో లేదో పూలతీవను అడగనక్కర లేదు, చూస్తేచాలు. నేనా పార్టీలోనే కనుపెట్టాను నీకు అతనికి పడదని."

సరోజనికి కోపం మైకం కమ్మినట్లయింది, "ఇంతకు నాకు అతనికి పడకపోవటం ప్రసక్తిఎందుకు? నే నతని స్నేహం కోరేనా ఏమైనానా?"

సుందరం మొదలుపెట్టాడు, "శంకరం మా ఆఫీసులో కార్మిక శాఖకు అధిపతి. నీ ఉద్యోగం వాని శాఖలోనిది. అతనితో సామరస్యం లేనివారు క్షణంకూడ అపని చేయలేని పరిస్థితి అది. ఏం, అర్థమవుతోందా సరోజనీ?"

సరోజని ముఖంలో కొంచెము తెలిచాయలు తొలకరింప దొడగినాయి. సుందరం తిరిగి పల్కసాగాడు, "చివర కేమయిందో చూశారా? ఆ లలితకూడా తగినదే దొరికింది. శంకరం ప్రవర్తనను బట్టి అప్పుడే అతనిని తొలగించవలెనని అనుకున్నాను గాని, వ్యవహారరీత్యా తగినంత గట్టికారణం చూపించటం కష్టమనిపించింది. సరే క్రమంగా లలిత శంకరం నిప్పుకు గాలిలా విజృంభించారు. వారి ప్రవర్తన వ్యక్తిగతంగా అవమానకరం కావటమే కాకుండా, మా వ్యాపార సంస్థకుకూడా కళంకకారణం కాజొచ్చింది. ఇప్పుడు నాకు కేవలం వ్యవహార రీత్యా తగిన కారణం దొరికింది వానిని తొలగించటానికి, వానితోపాటు లలితను."

మారుమాటలేక బొమ్మవలె నిల్చున్న శర్మ సరోజనులను చూస్తూ సుందరం అన్నాడు, "శర్మా, నీకు సరోజనిమీద ఎంత వాత్సల్యమో నాకుతెలుసును. ఆమెకు శ్రేయస్కరం కాని పరిస్థితులలో ఆమెను ఇరికించటం నీకు కష్టం కల్గించేదికాని తృప్తి నీయలేకపోయేది. నీకు తృప్తిని కలిగించనిపని నేనుచేసి యేమి లాభం? ఈమె నీ సరోజని కాక మరొక సరోజని అయివుంటే ఆనాడే ఉద్యోగం ఇచ్చివుండేవాడిని. ఫస్టుక్లాసు ఆనర్సుగదా!"

సరోజని శర్మవంక ఒకసారి నిండుగా చూసి ఎన్నడు తాను పొందనంత చిన్నతనంతో తల వంచుకుంది.

సుందరం పూర్తిచేశాడు, శర్మా యిన్నాళ్లు నీకు చెప్పవలెనని ఉబలాటపడేవాడిని గాని, తొందరపడి యితర వ్యక్తుల ప్రవర్తనలను గురించి ముచ్చటించట మెందుకన్న ఆత్మబలంతో నిశ్శబ్దం వహించి ఉన్నాను. నీవుకూడ ఆ ప్రసక్తి లేకుండా నాకు కొంత శాంతిని కలిగించావు."

సరోజనివంక చూస్తూ అడిగాడు, "ఏం సరోజనీ నీకు ఉద్యోగం రానిది నా మూలంగా కాదు. అసలు కారణం శర్మ."

* * * *

ఒకరి మనస్సు మరొకరికి స్ఫుటంగా సంపూర్ణంగా అవగత మయితే వ్యక్తుల జీవితాలలో ఎంత సామరస్యం శాంతి చేకూరుతుంది. కాని మానవజాతి కింత అదృష్టం అరుదు. మానవుని మనస్సు ఏ క్షణంలో ఎలా ప్రవర్తిస్తుందో ఊహించటం కష్టం; అంతేకాక మనస్థితి వ్యక్తీకరణకు అంతరాయం కలిగించే ముఖ్యహేతువు పరిస్థితుల ప్రత్యేకత. ఇవి అడకత్తెరలా అమరుతూ ఉంటాయి.

మానవుని శారీరక ప్రవర్తనను సూత్రీకరించటం మనస్తత్వ ప్రవర్తనను సూత్రీకరించటంకన్న ఎన్నోవిధాల సులభం. నిజానికి, అది నిర్దుష్టంగా విస్పష్టంగా చిత్రించగలిగినవాడు మానవ జీవితంలో శోభ తరుగుతుందేమో! తెలియనిదానికోసం పడే తపనలో ఉన్న ఆనందం ఒలిచిన అరటిపండులో లేదు. మనం ప్రేమించిన వ్యక్తి మనస్సు మన కొక పాలసముద్రం వంటిది. అది కదలిక లేని కాసారంగా కాక, వెల్లువ లుబికించే తరంగాలుగా ఉంటే మనకు కలిగే ఆనందం సంతుష్టి అనంతం.

తమకిష్టం లేదంటే నా కేంపోయింది ?

ఆసా : ఎట్లాఉంది ?

సైద : జుత్తుచూస్తే ఎలా ఉంటాడో తమకు తెలీదా బాబూ!

ఆసా : (కోపంగా) షటప్ ! నీ పేరేమిటోగాని, ఒచ్చినందుకు మహా ఎక్కటిపాఠం నేర్పేవ్ ?

సైద : కోపం మనకొద్దుబాబూ...తమలాటివారికది ఉపయోగం లేదు...

ఆసా : ఏమిటేమిటీ...? హఁ! (దిగ్గనదిగి) వచ్చినందుకు...సత్త వెధవ దుకాణం...

[పైకిపోతూ ఉంటాడు]

సైద : తమలాటివారు పాఠం నేర్చుకున్నారా? ఎంతమందో వాడి చూసేరు కదా? అన్నింటికీ మాది ఒకటేరకం బాబూ!

ఆసా : (రోడ్డుమీదకిపోతూ) వెధవదుకాణం.

సైద : గడ్డాం అన్నా గీయించుకోకుండా అలా అనకండి బాబోయ్! న్యాయం దయచేయించండి! తమకి దేవ్ ఆనంద్ క్రాఫు కావాలా? దిలీప్‌కుమార్ క్రాఫు కావాలా? నాగేశ్వర్రావ్ మీసం చెక్కమంటారా? ఏదన్నా రెడీ, ఈ ముసలాడు. ఎవడొస్తాడో రమ్మనండి ఆపాటివిద్దున్నవాడు. చాలెంజ్ !'

[దూరంగా ఆసామీమాటలు—పోరా! పోరా!]

[నీలిలుంగీ-మాసినగడ్డాం-వయస్సు చెప్పడం కష్టం-ముప్పై నలభై మధ్యని ఉండొచ్చు, మాసిఉన్నగడ్డాం, ఒంటి రంగులో కల్సిపోయింది. ఆ వ్యక్తి ప్రవేశం—భుజం మీద ఎర్రఅంచుల టర్కీతువ్వాలు - చేతికి రోల్డుగోల్డు గొలుసుతో వాచీ-చూడగానే అతిడొక బట్టలవ్యాపారస్తుడేమో అన్న అనుమానం కలుగుతుంది.]

అతను : ఏమిటి సైదయ్యా... నాగేశ్వర్రావు కేమిటయింది... అచ్చెచ్చే - నువ్వేం నాకు చెప్పటంలేదు...

సైద : ఓహోహో - చిన్నబాబు! రండి రండి...గడ్డం బాగా మాసిపోయింది. ఈసారికి రెండుసార్లన్నా గీయించ వల్సింది...ఈనెల బొత్తిగా కనిపించడం మానీసేరు.

చి. బా : ఔనుకాని, నాగేశ్వరరావుకి ఏమిటయిందన్నావ్...

సైద : తమకి తెలీకుండా నాకు తెలుస్తాయా బాబూ ఆ విశేషాలు...

చి. బా : నీదంతా 'అప్-టు-డేట్' కదు సైదయ్యా. సినీమా భోగట్టాలేమిటి, రాజకీయాలేమిటి—ప్రతీనెలా పట్నం వెళ్లిఒస్తూ ఉంటావ్ మరి...

సైద : ఒప్పుకున్నారా? ఒప్పుకున్నారా బాబూ! చూసేరా ఆ కలంపాటి మనిషి... అక్కిల్లీకొట్టుపక్క...

చి. బా : ఇంతకీ ఏమిటయిందో నాగేశ్వర్రావుకి చెప్పేవ్ కాదు - కొత్త సినిమా తీస్తున్నాడా...కొత్త ఫిల్ములో బుక్కైడా?

సైద : అదేంకాదుబాబూ....అంత గట్టిగా అన్నానుగదా తమరు ఆలకించే లేదా?

చి. బా : వింటే నిన్నడగడమేం...

సైద : ఇక్కడి 'పేపర్' బాబూ...మన దుకాణం 'అప్-టు-డేటు' ఆ బాబుకి చెప్పుతున్నాను - తమకి గీసేను నాగేశ్వరావు మీసం ఎలా ఉందంటారు...తమరు సరిగ్గా సినిమా యాక్టర్ లాగనే ఉన్నారు...

చి. బా : ఓస్. అదా! ఇంత గొడవానూ - ఏం బ్రహ్మాండం బద్దలయిందో అనుకున్నాను...

సైద : గడ్డాంనిండా వెంట్రుకలు చూస్తూఉంటే కత్తి ఉరకలేస్తోంది బాబూ....కూచోండి....

చి. బా : ఇలా ఈ బెంచీమీద కూర్చుంటాను కానీ...

సైద : నా పాపుకి చిన్నతనంబాబూ! రండ్రండి... కుర్చీ ఎక్కండి.

చి. బా : కాదు సైదయ్యా...

సైద : ఇవాళ కొత్తలా మాట్లాడుతారేం బాబూ...చిన్నప్పటి కాణ్ణించి తమరా కుర్చీలోనే కూర్చునే...

చి. బా : ఎప్పుడూ నీ బలవంతవల్లే.

సైద : నా ముందన్నారుకాని, ఇంకెవరిముందూ అనకండి బాబూ ఆమాట - దయచెయ్యండి కుర్చీమీదికి - దీన్నెంచుతారా బాబూ!

[చిన్నబాబు, చేసేదిలేక కుర్చీఎక్కుతాడు]

అది...అలా కూర్చోండి...తాజా తాజాకబుర్లుచెప్తాను.

చి. బా : ఏమిటి కొత్తసంగతులు ?

సైద : (బల్లదగ్గరకి వెళ్తూ) ప్రేమ్‌నాథ్, బీనారాయ్‌ని పెళ్లాడేడు...

చి. బా : (ఆశాభంగం కాగా) ఓస్...అది ఏనాటికబుర్లే...పెళ్లవడం...పిల్లలుపుట్టటం అన్నీ ఏనాడో అయింది...ఇదేనేటి సైదయ్యా నీ 'అప్-టు-డేటు?'

సైద : ముసలాణ్ణయిపోతున్నాను కదా బాబూ....గేపకశక్తి కూడా లేకుంటే మరి...పోనీ ఇది వినండి...అదెవర్తి చెప్మా...ఆ స్టారు...గుండ్రమొఖం అదీను...

చి. బా : *ప్రేమపుష్ప సంగతేనా ? నువ్వనేది ?

సైద : ఠీక్ !! సరిగ్గా సెలవిచ్చేరు...అది...

చి. బా : అది మొగుడ్నొదిలి, *బదరీనాథన్‌తో లేచిపోయింది.

సైద: (ఆశ్చర్యంగా) అర్రెర్రె! తమ కెలా తెల్సిపోయింది, నేను చెప్పకుండానే...

చి. బా : వెళ్ళిపోయి, నువ్వూ నీ గమ్మత్తులూనూ...

సైద : తమరుకూడా అలానే అనేస్తున్నారూ.

---

* ఈ పేర్లు కల్పితములు ఎవరికీ వర్తించవు.

చి. బా : మరేమనమంటావ్! నువ్వే కదా కిందటిసారి నాతో చెప్పేవ్...

సైద : తమకి సరిగా యాదస్తులేకపోయి ఉంటుంది...ఎక్కడో చదివిఉంటారు...

చి. బా : నువ్వు మరి వినిపించుకోవ్...నాకు ఆ పాటి ఓపిక కూడానా ?

సైద : పోనీండి, మరింకెప్పుడో ఇలాంటి కబురు తమరు చిత్తగిస్తారా ?

చి. బా : నువ్వేంచెప్పేవ్? నేను నీకు ఉల్లిఖారంలాటి కబురు చెప్తా విను.

సైద : తమరంత కోపగించుకోకండి. కబురు విన్నాక అనండి...

చి. బా : కబురు విన్నాక నవ్వను, నాకు కోపం ఉంటేనా... ఎంతలాంటి కబురో.

సైద : (కత్తినూరుతూ దగ్గరికెళ్ళి) చెప్పండి బాబూ...ఎంత కారంగా ఉందో చూదాం...

చి. బా : నీ కొడుకు ఒచ్చేడోయ్.

సైద : (షాకుతిన్నట్టయి) కొడుకా!!!

చి. బా : ఒక కొడుకుంటేవాడనే మరిచిపోతేం వేంటి?

సైద : (చిత్తరవౌతాడు)

చి. బా : ఉల్లిఖారంలా ఉందామరి?

సైద : (ముఖం భయంకరంగా మారుతుంది—ముఖం దగ్గరగా పెట్టి...కత్తిపైకెత్తి) నిజమా...చిన్నబాబూ?

చి. బా : (వెనక్కు తగ్గి, భయంతో) వోయ్! వోయ్! సైదయ్యా! ఇదేమిటి?

సైద : (ఈ ప్రపంచంలోకి పడినవాడిలా ఉలికిపడి) ఏదో ఒళ్లు మరిచిపోయినట్టయిందిబాబూ! (వెనక్కు తగ్గి) తమకెక్కడోపించేదు బాబూ...

చి. బా : నిజమేనని నమ్మేస్తున్నావేంటి కొంపతీసి! ఉత్తదోయ్.. ఉత్తుత్తికబురు...పదిహే నిరవైఏళ్లయిపోయిన వాడింకా రావడంకూడానా!

సైద : తమకి కనిపించే ఉంటాడు బాబూ...

చి. బా : భగవత్సాక్షి! తల్లితోడమ్మా! నీమీదొట్టు! ఉత్తనే భలేకబురు చెప్దామని నమ్మిస్తుచేసేనంతే...

సైద : (గొంతు తగ్గించి) నిజమా...అబద్ధమా చిన్నబాబూ!

చి. బా : సరదాకేలో అబద్ధం ఒకటాడేనని, అన్నీ అబద్ధాలేనా?

సైద : అంతమాటనగల్నా తమని!

చి. బా : సైదయ్యా...ఒకమాటచెప్తాను కోపగించుకోవుకద...

సైద : తెచ్చుకోక పోవడమేంబాబు! కోపంవస్తుంది...టీక మెయియ్యిపోస్తుంది...

చి. బా : వినకుండానే అనేస్తున్నావేంటి...

సైద : వినాలా బాబు...అపాటి గ్రహించుకోలేనా...

చి. బా : ఇరవైఏళ్లయింది వాడు వెళ్లిపోయి...ఇంకా నీకు...

సైద : లాభంలేదుబాబూ!

(సైదయ్య, గడ్డంగీస్తూ ఉంటాడు—పెద్ద, నల్లటి, మురికి గడ్డం—బాగా పెరిగినజుత్తు—ధూళిపట్టిన కాకీపంట్లాం, లాల్చీ—బాగా అరిగి, ఏనాడూ పాలిష్ఎరుగని బూట్లు—వీటి నన్నింటినీ మోస్తున్న ఒకమనిషి షాపులోనికి వస్తాడు—శరీరం బలమైనది. సులభంగా ఆవేశాన్ని పొందగలిగే పట్టిముఖం. వయస్సు 40, 45 సంవత్సరాల మధ్య ఉంటుంది.

అతనువచ్చి—

షాపు అంతా కలియచూస్తాడు - సైదయ్య ముఖంఎత్తి, పని ఆపిచూస్తాడు—

ఆ వ్యక్తి సైదయ్యముఖంలోకి తీక్షణంగా చూస్తాడు—సైదయ్య భయంతో ఉలికిపడ్డట్టవుతాడు)

వ్యక్తి : (కరకుగా) గడ్డాంగీస్తావయ్యా?

సైద : ఆబెంచీమీద కూర్చోండి.

వ్యక్తి : ఈ గడ్డాం గియ్యగలవా...

సైద : అందుకేకదు బాబూ నే నున్నాను...ఆ గడ్డాం ఏపాటి!

వ్యక్తి : నీ చేతులు వణకవు ?

సైద : (ఆశ్చర్యపోయి) చేతులు వణకడమా ? అదేమిటి బాబూ అలాఅడిగేరు !

వ్యక్తి : ముసలిచేతులు...అపాత కత్తి?

సైద: (నొక్కుతూ) వీడు సైదయ్యబాబు...ఈ కత్తా? ఇది తగుల్తే పుర్రున పీక ఎగిరిపోదా బాబూ !

వ్యక్తి : ఏదిచూదాం...వేగంకానీ...

సైద : బెంచీమీద కూర్చోండి దయచేసి ఈ గడ్డాం అయిపోగానే మీ దానిపని పడతాను...

చి. బా : వోయి సైదయ్యా! నీ కత్తిమాస్తే భయమేస్తోంది, నువ్వలా అన్నాక—చాలు చాలు...గడ్డాంఅవు...

సైద : ఇన్నేళ్ళయింది...సైదయ్య సంగతింకా కొత్తేనా? వీడి చేతిలో చెప్పినట్టు వినుకోదా బాబూ కత్తి !

[ఈలోపున వ్యక్తి బెంచీమీద కూర్చుంటాడు]

చి. బా : ఎంత పాతబడినా, నీ దుకాణం ఎక్కడసరికి కొత్తగానే ఉంటుంది మరి...

సైద : (గడ్డాంగీస్తూ) 'అప్-టు-డేట్' కదా బాబూ...

చి. బా : ఊళ్ళో 'కరంట్' లేకపోయినా నీ కొట్టుకి 'బల్బు'—ఎలక్ట్రిక్ 'స్విచ్చి'...

సైద : ఏ నిమిషం ఒచ్చిపడుతుందో, దాని సిగ్గోసిన ఎలట్రీ... అదొచ్చేసరికి మనం తయారుగా ఉండకపోతే మనషాపుకే పరువునష్టంబాబూ!

చి. బా : అదేకాకుండా ఎంత పాతబడినా కొత్తదనం ప్రతి సెకెండులో కనిపించేటట్టు చేసేది ఈ కుర్చీకింది పల్లాలు...




New **Behala De Luxe**

మహోత్సాహముతో తన పింఛము విప్పియున్న మయూరముం-
లా కొరకునకు, ఐ. ఇ. డబ్ల్యు. వారు వయ్యారమైన వంపులతో నిర్మిం-
చిన పంకాలు పరిపోలియున్నవి గదా! బెహాలా డీలక్స్ సున్నిత-
మైన పనితనములో సాటి లేనివియే గాక, కొద్దిపాటి కరెంటు ఖర్చుతో,
ఎక్కువ విస్తీర్ణమునకు చక్కని గాలిని విరివిగా నిచ్చును.
ఐ. ఇ. డబ్ల్యు. పంకా-ఆధునికమైనది, సుఖము, పొదుపునిచ్చునది;
వివరకు డాపరులు యేరి కోరునది.




దీ ఇండియా ఎలెక్ట్రిక్ వర్క్సు లిమిటెడ్,
“జవహర్ బిల్డింగ్స్”
29, మౌంట్ రోడ్ : : మదరాసు-2.

పైడి : బాబూ...నా కొట్టుని ఎకసెక్కెం ఆడ్డం ధర్మమా! ఇన్నేళ్ళయి ఎవరూ...

చి. బా : ఆగాగు...మళ్ళా మొదలెట్టకు...నీ ధాటికి ఎవ్వడూ తట్టుకోలేడని తెలుస్తూనే ఉంది...తెలుసుకూడానూ... ఇంక నేను ఏమాత్రం పోట్లాడ్డం లేదు...అది సర్టిఫే టనుకో...

పైడి : లక్ష సర్టిఫేట్లున్నాయిబాబూ! ఇక్కడి కలక్టర్ దొర గారిది...తెల్లదొరగారే ఉండేవారుబాబూ...ఆయన తర వాతి ఇద్దరు కలక్టర్ బాబు లిచ్చేరు...ఆ తరవాతగదా పెద్ద పట్నంలోకి ఆఫీసు బదిలాయింపయిపోయింది.

చి. బా : అయ్యో—కాదూమరి...వాళ్ళకి నువ్వే కాని...

పైడి : ఇంకెవ్వడూ నల్లడమే...

చి. బా : లేదుకూడా...

పైడి : ఈ నల్లులగురించే కదుబాబూ...గంద్రగోళం. చూడండి ...ఇవాళ వీటిపని పట్టిస్తాను...ఒక్కటిలేకుండా కలిమ్ చేసి పారేస్తాను...

చి. బా : ఆ పని నిజంగా చేసేసేవ్ సుమా!

పైడి : ఏంబాబూ ?

చి. బా : నీ దుకాణానికున్న మజా, కొత్తదనం అంతాపోతుంది..

పైడి : అలా సెలవిస్తారేంబాబూ!

చి. బా : ఒక్కొక్క కోటు ఎంత కొత్తదనం చూపిస్తుందను కున్నావ్—ఒక కోటు ఇంకొక కోటులా ఉండదు... ప్రతికోటులోనూ అవి కొత్తదనంకోసం అందిస్తూనే ఉం టాయిలే... నువ్వే వాటిని చంపేస్తే ఈ కొట్టుకున్న గొప్పదనం కొస్తాపోతుంది...

పైడి : హాస్! ఎంతనిజం పలికేరు!

చి. బా : కొంపతీసి నిజమే అనుకుంటున్నావేం!

పైడి : నిజంకాకపోతే అబద్దమా బాబూ? తమరన్న మాటలు—

చి. బా : నాకే అప్పచెపుతున్నావ్ ఇందాక మాటల్ని...ఏదో పోట్లానికన్నాను కాని వాటిని ప్రయాణం కట్టించే ఏర్పాటు వేగంగా చెయ్యి...

పైడి : గడ్డాం చిన్న ముక్క ఉంది...ఆగండి....

చి. బా : ఏమిటి? ఏం ముక్కా?

పైడి : ఉండండుండి—చెక్కుకుపోతుంది.

చి. బా : ముక్కు ఎగిరిపోతుందన్నావ్ కావు.

పైడి : (పని ఆపి) ఆఁ—అయిపోయింది. ఈపాటిదానికి పెద్ద గడబిడ చేసేరు...

చి. బా : నువ్వా—నేనా?

పైడి : అడుగుతున్నారు కూడాను...
ఆఁ...సరే...'ఫ్లష్' కొట్టనా ముఖానికి...

చి. బా : ఆ నీరా? ఒద్దుబాబూ.. ఎంత పాతిబడ్డా అడగటం మానవేం?

పైడి : పోనీ తలకి 'షాంపూ' చేసేదా?

చి. బా : ఒద్దుబాబూ... ఏదీఒద్దు! నన్నింక విడుదలచెయ్యి... (కుర్చీదిగి) హమ్మయ్య!!

పైడి : (వ్యక్తిని ఉద్దేశించి) ఇంక మీ రెక్కండి కుర్చీ!
[ఆ వ్యక్తి కదలడు]

చి. బా : అన్నట్టు పైడయ్యా—ఏదీ నీ మసాలాదోసెలాంటి కబురు మరి?

పైడి : మరోసారి బాబూ...

చి. బా : నే నిక్కడికొచ్చినప్పుడు...ఏం?

పైడి : లీక్ గా సెలవిచ్చేరు...

చి. బా : పదిరోజులుపోయేక...ఈ కబురే...

పైడి : పొరపాటు బాబూ...ఎప్పటికప్పుడే వేడిచేస్తానుబాబూ.

చి. బా : సరేలే...అప్పటిసంగతి...
[చిల్లరతీసి ఇస్తాడు]

పైడి : (పుచ్చుకొని. అదోకరకంగా, అంటే అతి వినయంగా ముఖం పెట్టి, నంగిగా నవ్వుతూ) చిన్నబాబూ...మీకు తెలీని సంగతా నేరం అట్టేలేదు...ఎల్లుండి మళ్ళా రావాలి గడ్డానికి—

చి. బా : అందుకే ఇక్కడికి నాకు రావడానికి జంకు...నువ్వె ప్పుడూ ఇంతే.

పైడి : ఎప్పుడన్నా అడిగేనా...తమరే చెప్పండి...

చి. బా : (రూపాయి నోటిస్తూ) ఊళ్ళో మరో దుకాణమే లేదు కదా, నీకు నేరం లేకపోడమేమిటి...ఇదే వినడం...

పైడి : దుకాణమైతే లేదుకాని బాబూ...ఆ కత్తివెనవలంతా ఉన్నారుకదా...ఇంటిటికీ వెళ్ళి ఏగాణీకూడా గడ్డాం గీసే రకం...

చి. బా : పాపం ఆయన కూర్చున్నాడు...ఆయన్ని చూడు...

పైడి : అదీకాక, బాబూ...ఈ ఊళ్ళో మనుషులుకూడా రోజు రోజుకీ పాతైపోతున్నారు బాబూ...ఒక పిసరూ 'ఫేషన్' లేదుకదా....బుర్రల్లేవు బాబూ చాలామందికి.. ఏమంటే అనండి కాని టోపీలుకుట్టినట్టి ఆ వెధవలు దొక్కిసినా అదే బావుందనుకొని తిరుగుతారు...

చి. బా : (వ్యక్తిని, నిదానంగా చూసి) మిమ్మల్నెక్కడో చూసి నట్టుంది...

పైడి : (తనధోరణిలో) ఇంక నేనా ఎలక్ట్రి మెసేజి అంటే మర్దనచేస్తుంది లెండి, గడ్డాంగీసేది, ఇవన్నీ తెప్పించి ఉంచుదామని చూస్తున్నాను...అందరూ దార్లోకొస్తా రండి....ఎంతకాలం అలాగ...

వ్యక్తి : (చిన్నబాబుని ఉద్దేశించి) పొద్దున్న హోటల్లో చూసి రేమో....

చి. బా : హోటలుకి నేనువెళ్ళేదేలేదే?

వ్యక్తి : ఏదో రైల్లో చూసేరేమో...

చి. బా : సంవత్సరమై ఈ ఊరుకదల్లేదే నేను...

వ్యక్తి : రాత్రిళ్లెక్కడన్నా చూసేరేమో...

చి. బా : అమ్మ బాబోయ్...రాత్రుళ్లే!

వ్యక్తి : సినిమాలో చూసేరేమో.

చి. బా : (ఆశ్చర్యపోయి) మీరు సినిమాలో వేషాలు వేస్తారా ?

వ్యక్తి : (మరింత ఆశ్చర్యంగా చూస్తూ ఉంటాడు)

సైద : (ఏమీ ఆశ్చర్యం లేకుండా) మన ఉూపంటే ఏమిటను కున్నారు బాబూ...ఇతనేం ఏక్టరు! ఇతని బాబులాటి వాళ్లొస్తారు...చూడండి...ఎల్రక్టీ రానీండి...

చి. బా : (దగ్గరగావెళ్లి, ఆప్యాయంగా) అయితే తమ రెండెం దులో....

సైద : తమరుకాని నాగేశ్వరావు కాదుకద!

వ్యక్తి : పోలీసుల్ని పిలవమంటారా ?

సైద : } పోలీసా !!
చి. బా : }

సైద : ఎందుకు నాగేశ్వరావు బాబూ! ఎందుకు ?

చి. బా. మీ పెట్టె, పరుపు రైల్లో మరిచిపోయేరా ?

వ్యక్తి : మీ ఇద్దర్నీ పిచ్చిఆసుపత్రిలో పెట్టించడానికి...

[ఇద్దరూ వెనక్కి తగ్గుతారు]

ఏమిటో వాసుడు మరి, అర్థంలేకుండా.

చి. బా : మీ మాటలకే అర్థం లేదు...

సైద : ఎందుకుబాబూ, జట్టీ-గడ్డాం గిరాయ్యలేమో, కూర్చోండి.

వ్యక్తి : కాదు—మీ ఇద్దర్నీ చూస్తూఉంటే నవ్వొస్తోంది. ఏదో సినిమా హాల్లో చూసిఉండొచ్చని నేనంటే, సినిమాలో వేషాలేస్తారా అని అతనంటాడు, వెంటనే నువ్వు దాన్ని ఛాయపరిచేసి పేరుకూడా పెట్టేవ్....

చి. బా : అయితే మీరు సినిమావాళ్లు కారన్నమాట...ఇంకేం...

వ్యక్తి : ఓరి భగవంతుడా! ఇంకా అనేగోలా!

చి. బా: (కోపంవచ్చి) బస్తీలవింటొచ్చి అంతా మీకే తెల్సు నన్నట్టు, మీరే పెద్ద తెలివైనవాళ్లయినట్టు మాట్లాడతారు.

సైద : అలా అంటే నే నొప్పను చినబాబు! మనదిమాత్రం బస్తీ కాదా బాబూ...చూస్తొండండి! ఇంకో రెండేళ్ళలో ఈ ఊరుమజా, నా షాపు ఎంతదయిపోతుందో!

చి. బా : ఇలాటి ఊళ్ళకొచ్చి పెద్దడాబుచేస్తారు...

సైద : మనం అంతకన్నా చేస్తాం...ఎల్రక్టీ రానీండి...

చి: బా : నేనూ ఉంటేవాణ్ణి పట్నంలో - నాకూ తెల్సు ఇలాటి వన్నీ.

వ్యక్తి : (కళ్లలో హాస్యాన్ని అనుభవిస్తున్నట్టు ఆనందాన్ని చాటుతూ) మన ధోరణి ఎప్పుడూ ఒకలానేఉంది!

చి. బా : ఏమిటీ? ఎవడి ధోరణి? నా సంగతి మీకేం తెల్సు?

వ్యక్తి : (సర్దుకుంటూ) మీ సంగతే కాదు...అందరి సంగతీని...

చి. బా : అందరిగురించీ అనడానికి తమకేం అధికారం ఉంది...

వ్యక్తి : బస్తీవాళ్ళగురించి అనడానికి తమకేం అధికారం ఉందో అనే...

సైద : బాబూ....ఎల్రక్టీ...

వ్యక్తి : (కఠినంగా) వోయి సైదయ్యా! నన్ను పొమ్మంటావా. అతన్ని పంపిస్తావా?

సైద : అమ్మమ్మ! తమ నెలా పొమ్మంటాను బాబూ! ఎంత దూరంనుం చొచ్చేరో, నా షాపు వెతుక్కుంటూ... ఇంకో సైదయ్య మీ కెక్కడి దొరకుతాడు బాబూ!

చి. బా : అయితే, ఉండాలనుకుంటే, అతని మాట విని నన్ను పొమ్మంటావా?

సైద : ఛా...ఛా!! అదెలా అనగల్ను...ఈ నోటితో చిన్న బాబూ!

[చిన్న బాబు ముఖం వికసిస్తుంది]

నాన్న గారు ఇంటికెళ్లే వేళయింది. తమరు దుకాణం మీ ద్దుండాలి మరి...

చి. బా : (ఉలిక్కిపడి వాచీ చూసుకొని) నచ్చేం సైదయ్యా.... ఆలస్యం అయిపోయింది. అగ్గయిపోతాడు ముసలాడు...

[గబగబ పోతాడు]

సైద : (అతని వెనుక) నా పేరు చెప్పండి బాబూ......పరవా ఉండదు! (వ్యక్తిని చూసి) ఆఁ...ఇంక తమరు దయ చేయించండి కుర్చీమీదకి....

వ్యక్తి : నే నిక్కడే కూర్చుంటాలే...

సైద : తమ కాహాటి గౌరవం లేకపోతే ఎలాగ—సైదయ్య షాపులో తమకి అమర్యాదా జరగకూడదు...నా షాపుకి పరువునష్టం ఉండకూడదు...

వ్యక్తి : నాకు సంతోషంగా ఉండడమేకదా కావాలి...ఈ బెంచీమీదే నాకు పరమసంతోషం...

సైద : నా దుకాణం, పేరు అదీ తమ రలా కొట్టిపారేస్తే...

వ్యక్తి : నీ పనివాడితనం, అందరికీ, నానాత్రే, ఊరూరా, దేశ దేశాలా చాటుతుంది...అంతకన్న నీకేం కీర్తి, నీకేం గొప్ప కావాలో చెప్పుబాబూ!

సైద : (చిన్నబోయి) ఎంత డబ్బు కర్చుచేసి చేయించేనా కుర్చీ! అలాటి కుర్చీ.

వ్యక్తి : అంత డబ్బు కర్చుఅయినందుకు, దాని శక్త్యనుసారం అది నీ సేవచేసింది...నలభైఏళ్లయి అది...(తడుముకొని) నలభైఏళ్లైనా ఉండదా దాని వయస్సు?

సైద : (ఆశ్చర్యంగా) ఎంత ఠీక్ గా చెప్పేరు బాబూ...సరిగ్గా ఈ ఏడాదితో నలభై పూర్తయింది...

వ్యక్తి : డబ్బు పుచ్చుకొనే నౌకరుకూడా అన్నేళ్లు, అంత విశ్వా సంగా మనిషికి సేవచేసి ఉండడం...

సైద : ఇప్పుడు మాత్రం అదేం లోపంచేసింది బాబూ...

వ్యక్తి : ముసలిదైమయినా ముసల్దే మరి...

సైద : ఎల్లుండే...

వ్యక్తి : రాదు.

సైద : (ఆశ్చర్యపోయి) ఆఁ...ఏమిటి బాబోయ్! తమ రలా అంటారు...

వ్యక్తి : నీ కాలంలోనే కాదు, నీ కొడుకుకూడా చూడ్డు...

సైద : కొడుకా!?

వ్యక్తి : ఏం?

సైద : (మాట్లాడడు)

వ్యక్తి : ఏం ఒక్కసారి ఆగిపోయేవ్...

సైద : కొడుకులెవరూ లేరుబాబూ...తమ దయవల్ల...పిల్లలే లేరుబాబూ...

వ్యక్తి : (ఆశ్చర్యాన్ని మరుగుపరుస్తూ) నవ్విపోతారు ముసలాడా. మనవలు కూడా ఉండవల్సిందే నీకు! ఆశ్చర్యంగానే ఉంది.

సైద : ఎందుకు బాబూ?

వ్యక్తి : నువ్వసలు పెళ్ళిచేసుకోలేదా?

సైద : తమ తల బాగా మాసింది....క్రాపు చేయించమంటారా?

వ్యక్తి : అలానే కానీ. ముందు నాకు చెప్పు...

సైద : (క్రాపుచెయ్యడంలో మునిగి) అదే అయితే ఏ ఏడుపూ ఉండకపోను బాబూ... తమరిష్టం...లేవకండి...బెంచీ మీద కూర్చోండి...

వ్యక్తి : ఇంకో పెళ్ళాన్ని తెచ్చుకోలేకపోయావ్! ఏం చింతా ఉండకపోను...

సైద : (వింతగా) ఎందుకు బాబూ?

వ్యక్తి : పిల్లలకోసం...

సైద : (క్షణం మౌనం వహించి) తల్చుకుంటే గుండెకాయ పగిలిపోయి, భయం పుట్టుకొస్తున్నాది...మరో పెళ్ళి!!

వ్యక్తి : పిల్లలు కావాలంటే అదే చెయ్యాలి. ఏడ్చి ఏం లాభం?

సైద : పిల్లలు పుట్టక కాదు బాబూ...

వ్యక్తి : పిల్లలుంటే వారసు మాట......అయితే మీ ఇద్దర్లో ఎవరి లోపం లేదూ....ఎవ్వరూ బతికలేదా...

సైద : ...బతికలేదు బాబూ...

వ్యక్తి : (ఆశ్చర్యపోయి) నిజంగా? (సర్దుకొని) నీ డాక్టరుకన్నా చూపించుకోవల్సింది...పిల్లలు పుట్టిపోతూవుంటే అది తప్పించడానికి వీలుంది తెల్సునా?

సైద : (నిరసనగా నవ్వి) డాక్టర్లా బాబూ! ఈ బూమిమీది డాక్టర్లా...ఉహుఁ...

వ్యక్తి : చాలా గుప్తంగా మాట్లాడుతున్నావ్...

సైద : నా కొడుకు నాకుండేటట్టు దేముడే చెయ్యలేక పోయేడు బాబూ! ఈ డాక్టర్లా!

వ్యక్తి : పుట్టింది ఒక్కడే కొడుకా?

సైద : ఇంకా ఎక్కువమందెందుకు బాబూ...మిగిలిన ప్రాణం కాస్తా బాధపెట్టి తియ్యడానికి...

వ్యక్తి : ఔను...చాలా కష్టంగానే ఉంటుంది...... ఎన్నాళ్లు బతికి, పోయేడు...

సైద : పాతికేళ్లు బాబూ...

వ్యక్తి : పాతికేళ్ళు!! అమ్మమ్మ! చెట్టంత మనిషి...

సైద : ఔను బాబూ...

వ్యక్తి : ఎంతపని! చేతి కందుకొచ్చిన కొడుకు...ఎలాపోయేడు! ఏమయింది...ఏ జబ్బు?

సైద : (మౌనం)

వ్యక్తి : పెళ్లికూడా అయిందేమిటి కొంపతీసి!

సైద : ఒక ఎనుబోతులా ఉండేవాడు బాబూ...(ఊపిరి బిగపట్టి) కొవ్విపోయిన ఎనుబోతులా...

వ్యక్తి : ఏంమాటలోయ్!! అలానే పోలుస్తారా పోయినకొడుకుని!

సైద : అబద్ధం కాదుబాబూ. కొవ్వుబలిసిన ఎనుబోతులా ఉండే వాడు...

వ్యక్తి : నీ ఉద్దేశం అంత బలంగా అనా?

సైద : చిత్తం!

[మౌనం]

ఒడ్డూ, పొడుగూ తమలానే ఉండేవాడు...

వ్యక్తి : నన్నూ కొవ్వుబల్సిన ఎనుబోతే నంటావేంటి కొంపతీసి!

సైద : (వినిపించుకోకుండా) మహా గొప్ప తెలివిబాబూ....

వ్యక్తి : నిజంగా?

సైద : బాగా తెలివిఉండేది బాబూ...ఎంత ముందాలోచన!

వ్యక్తి : (విచారంగా) అలాటివాళ్లికి భగవంతుడు ఆయుష్షు ఇవ్వడు...

సైద : అలా అనకండిబాబూ...అలాటి కొడుకే దక్కకుండా తండ్రి గుండె బిరక్కొట్టిపోతాడు...

వ్యక్తి : ఏదన్నా ఒకటే...ఎంత కష్టం! ఈ ముసలికాలంలో నువ్వొక్కడివి...

సైద : ఏంచేస్తాను బాబూ....

వ్యక్తి : ఎలా పోయేడో చెప్పేవ్ కాదు...

సైద : ఎలాపోయేడా...(మౌనం) గుండె బాబూ...గుండె...

వ్యక్తి : అంత దుక్కలా, ఎనుబోతులా ఉండేవాడివన్నావ్?

సైద : మనిషి ఎంత దుక్కలా ఉన్నా గుండె పిడికెడేకదు బాబూ...అది సరిగా పనిచెయ్యలేదు బాబూ...బుర్రా అన్నీ బాగా పనిచేసేయి...మరి గుండెకూడా బాగా పని చెయ్యాలి కదు బాబూ, బతకడానికి...

వ్యక్తి : గుండె ఆగిపోయిందా?

సైద : ఔను బాబూ...గుండె రక్తం చిమ్మడం మానేసింది బాబూ...ఎర్రటి రక్తం...జేగురులాటి రక్తం చిమ్మడం మానేసింది బాబూ...

వ్యక్తి : జేసురులాటి రక్తమా?

పైడి : ఔనుబాబూ...మంచి రక్తం...ఇక్కడికి తుపురాని కొచ్చే డాక్టర్ బాబు చెప్పేవారు. గుండెకాయ ఎర్రటి రక్తం చిమ్ముతుంది...నల్లటి రక్తాన్ని ఎర్రగా చేస్తుందని ...కాని, ఎర్రరక్తం కక్కడం మానేసింది బాబూ... నల్లటి సిరాలాటి రక్తం, గరళంలాటి రక్తం...కక్కింది ...దాంతో వాడు పోయేడు...

వ్యక్తి : గుండె ఆగిపోతే ఏ రక్తమూ చిమ్మదు...నల్లరక్తం చిమ్మడమేమిటి నీ బుర్ర!

పైడి : (నవ్వి) బాబూ...గుండె....మనిషి గుండెసంగతింకా తెల్సుకోలేదా బాబూ....నా కొడుకులాటి కొడుకు తమకుంటే తెలుస్తుంది...

వ్యక్తి : గమ్మత్తుగా చెప్తున్నావే!

పైడి : గుండె విషం కక్కుతుందని తమకి తెలీదా?

వ్యక్తి : అంటే?

పైడి : అది విషం కక్కినప్పుడు మనిషి, మనిషికాడు బాబూ.... మనిషి, మనిషిలా బతకడు బాబూ....అంటే ఆ మనిషి చచ్చిపోతాడు....

వ్యక్తి : (ఆశ్చర్యంగా వింటూఉంటాడు)

పైడి : ఆమనిషి మనమధ్య మరి కనిపించడం....కనిపించినా వాడి నెవరూ మనిషనరు....పోల్చుకోనే లేరు....వాడు దెయ్యంలానే బతుకుతాడు బాబూ...

వ్యక్తి : అంటే ఒళ్లుంటుందా?

పైడి : అదుండకేం బాబూ? దానికి మనందరికన్నా పెద్ద ఒళ్లుంది...దాన్ని మనం మనిషిని చూసినట్టు ఎందుకు చూడం? అలాగే ఆ దెయ్యంగాడి గుండెవేరు...మీరే మనిషెందుకయేరు? మీ గుండెనిబట్టే కదా బాబూ? మంచి రక్తం కక్కితే మంచి గుండె—విషం కక్కితే చెడ్డ గుండె......చచ్చిపోయినట్టే లెక్క...

వ్యక్తి : నీ కొడుకు బతికే ఉన్నాడన్న మాట...

పైడి : పొరపాటు బాబూ... చచిపోయేడు...నా కే కొడుకూ లేడు.

వ్యక్తి : ఒళ్లు ఉందన్నావ్...

పైడి : ...అది ఎక్కడో వుంటే ఉండొచ్చు......అదున్నంత మాత్రాన వాడు మనిషి కాడు, నా కొడుకు కాడు... అది దెయ్యం బాబూ...వాడి దెయ్యం...

వ్యక్తి : గమ్మత్తుగా ఉందే...

పైడి : ఈ ఊళ్లో ఎవణ్ణైనా వాడిని మనిషిని అనమనండి. లేదు బాబూ...ఆ గుండె ఆగిపోయింది...ఆ మనిషి చచ్చిపోయేడు...ఆ దెయ్యం మరి ఈ మనుష్యులమధ్య నెలా ఉంటుంది? పోయింది...ఆ వికారం మొఖం చూపించుకోలేక...

వ్యక్తి : (వింతగా చూసి) నీకొడుకు, నీదగ్గర ఉండకుండా పోయేడంటూ...

పైడి : (పళ్లు బిగపట్టి) చచ్చిపోయే డనండి బాబూ...

వ్యక్తి : ఏదో రహస్యం ఉందిందులో...

పైడి : అందరికీ తెల్సినదే బాబూ...ఊళ్ళో అందరికీ తెల్సినదే.

వ్యక్తి : కొడుకంటే అంత అయిష్టంగా మాట్లాడుతున్నావేం ...

పైడి : కొడుకంటే నా కయిష్టమా! కాదు బాబూ...వాడిని పువ్వుల్లో పెట్టి పెంచేను...ఏ లోపం వాడికి చెయ్యలేదు...వాడంటే ప్రాణంలా చూసేవాణ్ని...

వ్యక్తి : అయితే అంత కోపం ఎందుకు...

పైడి : ఆఖరికి బంగారుబొమ్మ...రత్నం......నిజంగా రత్నం బాబూ...అలాటి పిల్ల!...ఆ పిల్లనిచ్చి పెళ్లిచేసేను...

వ్యక్తి : అయితే మరి...

పైడి : నాకు నా కొడుకుమీద కోపం లేదు బాబూ...ఆ దెయ్యాన్ని చూస్తే నాకు భయం, అసహ్యం, రెండూనూ...

వ్యక్తి : అలా అనకు పైడియ్యా...నీకొడుకు ఇంతకీ ఏం చేసేడు, అతన్ని దెయ్యంకింద జమకట్టేసేవ్...నీ కొడుకు మనిషెందుకు కాడు?

పైడి : కళ్లలో చూస్తే తెలీదా బాబూ...భేదం?

వ్యక్తి : నీ కొడుక్కి నువ్వంటే ప్రేమలేదా....

పైడి : వాడు బతికున్నన్నాళ్లూ నేనే వాడికి అన్నీ బాబూ... నా కొడుక్కి నేనే అన్నీని...కాని వాడు చచ్చిపోయేడు ...ఇరవైఏళ్లు దగ్గరగ్గరయింది...

వ్యక్తి : పోనీ ఆ దెయ్యం ఎక్కడుందో తెల్సా...

పైడి : ప్రపంచంలోకి పోయింది...ఎక్కడెక్కడో తిరుగుతూ ఉంటుంది...అలాటి దెయ్యాలెన్నో ఉన్నాయిబాబూ ప్రపంచంలో...నా టన్నిటితోనూ తిరుగుతుందా పిశాచం...

వ్యక్తి : నీకు కనిపించలేదా?

పైడి : దెయ్యమా బాబూ?

వ్యక్తి : ఊఁ...

పైడి : (పళ్లుబిగించి) కనిపిస్తేనా బాబూ! దాన్ని ఆనాడే ఈ కత్తితో ముక్కలుచేసేసి ఉందును బాబూ...చిన్న చిన్న ముక్కలు తరిగేసి ఉందును బాబూ...

వ్యక్తి : పైడియ్యా!!

పైడి : బాబూ!!

వ్యక్తి : నువ్వుకూడా చచ్చిపోయేవోయ్...నువ్వూ దెయ్యానివే.

పైడి : నేనా బాబూ!!!

వ్యక్తి : కన్నకొడుకుమీద అంత కోపమా...అటువంటిమాటలా!!

పైడి : అది వింటే మీరలా అంటారా బాబూ...అప్పుడు తమకి తెలుస్తుంది వాసుండే ఎలాటిదో...ఎంత ఎర్రటి రక్తం అది చిమ్ముతుందో...

వ్యక్తి : అంటే ఏంచేసేడని ?

పైడి : ఖూనీకోరుకి ఏం శిక్షఇస్తారుబాబూ?

వ్యక్తి : ఖూనీ కోరుకా?

పైడి : చెప్పండి- తమ నోటంట!

వ్యక్తి : చావు.

పైడి : ఒప్పుకున్నారా? మరి, ఖూనీకోరుని చంపడం తప్పా బాబూ?

వ్యక్తి : ఓరి భగవంతుడా! పైడయ్యా! నీకు నిజంగా మతిపోయిందోయి.

పైడి : తమరే తమ నోటంట ఒప్పుకున్నారు...

వ్యక్తి : నీ కొడుకు ఖూనీకోరా!

పైడి : నాకొడుకు కాదుబాబూ...వాడిదెయ్యం....ఆదెయ్యం కనిపిస్తే...

వ్యక్తి : ఎవర్ని ఖూనీచేసేవు!!

పైడి : (ఒకక్షణం మౌనం)
(గద్గదస్వరంతో) నా రెండో ప్రాణాన్ని బాబు...

వ్యక్తి : అంటే...

పైడి : ఆ బంగారపు బొమ్మని...ఆ రత్నాన్ని! నా ముద్దుకోడల్ని! వాడి పెళ్లాన్ని!

వ్యక్తి : (ఆశ్చర్యపోయి) పెళ్లాన్ని! స్వంతపెళ్లాన్ని చంపేడా!

పైడి : గుణాలరాసి బాబూ! ఎంతపుణ్యంచేసుకుంటే వాడి కలాటి పెళ్లాం దొరికింది...నా కలాటికోడలు ఎంత అదృష్టంవల్ల దొరికింది...(దుఃఖంతో) ఎంతబుద్ధి! ఎంత మప్పితం!
నన్నెంత భక్తిగా చూసేది—వాడి నెంత ప్రాణంగా చూసేది...దాన్ని... (దుఃఖం ఆపుకుంటూ ఉంటాడు)

వ్యక్తి : అర్రర్రె! ఎంతపనిచేసేవు...

పైడి : (దుఃఖంతో నోటమాటరాదు)

వ్యక్తి : పోలీసులెలా తప్పించుకున్నాడు. నువ్వెలా ఊరుకున్నావ్...

పైడి : (ఇంకా దుఃఖంలోనే మునిగిఉంటాడు)

వ్యక్తి : ఇంతకీ అతనికెందు కాబుద్ధిపుట్టింది...ఏదో ఉండి ఉండాలిమరి...

పైడి (దుఃఖం అణుచుకొని) బాబూ...తమరూ పెద్దవారే. ప్రపంచంలో ఎన్నెన్నో పొరపాట్లు మొగాళ్లు చేస్తూ ఉంటారు. ఏవేవో లేనిపోనివి అనుకుంటూ ఉంటారు. నేనూ అలా అనుకున్నవాణ్నే ఒకొక్కసారి—విన్నవన్నీ నిజంగా నమ్మడమే. అవన్నీ నిజం అనుకొని, ఇష్టంవచ్చినట్టు నడచీడమే?

వ్యక్తి : ఏమిటి నమ్మేసేడు ?

పైడి : నిజంగా ఆ పిల్ల మహా ఇల్లాలు...దానిమీద ఈ వెధవ, ఈ రౌడీవెధవ ఏవేవో అనుమానాలు పడ్డాడు...పిల్ల బంగారంలా ఉండేది...అందుకే ఆవెధవకి అనుమానం పట్టుకుంది...దానికి ఎన్ని సంబంధాలు కట్టేడు...

వ్యక్తి : నిజంగా ?

పైడి : మొదట్లో అంతగా ఉండేదికాదు...రానురాను...దాన్నికో ప్రశ్న వెయ్యడం వాడివేపు చూసేవ్...వీడివేపు చూసేవ్ అనడం...ఎక్కడికో వెళ్లిపోతావని సగం రాత్రికొచ్చి తలుపుకొట్టి తనిఖీచెయ్యడం తననుకున్నట్టు కాకపోయినా అనుమానం మరింత పెంచుకోడం దాన్ని కొట్టడం...ఇలా నరకబాధలు పెట్టేవాడు బాబూ...

వ్యక్తి : ఆఖరికి చంపేసేడన్నమాట...పోలీసులంతా మరి ఏం అయేరు ?

పైడి : పోలీసులా? (విరసనగా నవ్వి) ఎందుకీ పోలీసులు బాబూ...వాడి తెలివిముందు ?

వ్యక్తి : అంటే...

పైడి : వాడిని పోలీసులు పట్టుకోగలరా? పట్టుకున్నా ఏం చెయ్యగలరు...

వ్యక్తి : తప్పించుకున్నాడా ?

పైడి : వాడికెంత తెలివి...తనచేత్తో చంపుతాడా బాబూ...

వ్యక్తి : మరి ?

పైడి : దాన్ని అదేచంపుకొనేటట్టు చేసేడు...

వ్యక్తి : ఆత్మహత్య చేసుకుందా ఆవిడ ?

పైడి : ఎందుకు చేసుకుంటుంది బాబూ—వీడు చేయించేడంతా ?

వ్యక్తి : ఇతని బాధలు పడలేకేమో...

పైడి : వీడిబాధలు అది లెక్కచేసేది కాదుబాబూ...ప్రాణం ఉన్నన్నాళ్ళూకూడా ఓర్చగలదది...ఎలాటి బాధలు పెట్టినా...ఎంత ఓర్పుగుణం దాన్ది!

వ్యక్తి : అయితే ఎందుకుమరి చంపుకుంటుంది ?

పైడి : ఇవన్నీ నా కెలా తెలిసేయుంటాయి...మా ఇల్లు ఏపాటిది బాబూ...పక్కగదే వాడి...చెవులు రిక్కించుక వినే వాణ్ని...తాడే తాగివచ్చి గోలచేసేవాడు...."ఈ రండ వెధవబతుకు బతక్కపోతే నూతిలోపడి చావకూడదే...ఈ కుక్క వెధవ బతుకు బతక్కపోతే ఉరిపోసుక చావకూడదే" అని. ఇలాగే బాబూ...అది చావడమే వాడికొక్క పాలన్నట్టు దాన్ని తిట్టేవాడు...నే నింకా మీకు మంచిమాటల్లో చెప్పేను...ఆ తిట్లు వినలేం బాబూ!

వ్యక్తి : [ముఖం ఎర్రగా మారుతుంది]

సైద : ప్రమాదంగా కొట్టేవాడు కాదు...ఈమాటలే. నేనారోజు ఊర్లో లేను. పట్నం వెళ్లేను...ఇది జరిగిపోయింది... నే వచ్చేసరికి దాన్ని పాతిడం కూడా అయిపోయింది...

వ్యక్తి : నువ్వవింటూ, తెలిసి ఊరుకున్నావా?

సైద : ఊరుకుంటానా? మర్నాడు వాడ్ని ముఖం వాచిపోయే టట్టు తిట్టేవాడ్ని...ఆ కోపం అంతా దానిమీద రాత్రి చూపెట్టేవాడు...దాంతో నేను తగ్గవల్సివచ్చేది...దాని కోసం ఆ పిల్లకోసం...ఇంతమట్టుకి వస్తుందని తెలుస్తే.

వ్యక్తి : చాలా అన్యాయం జరిగింది...నువ్వా పిల్లని కాయ వల్సింది...

సైద : (గొంతు తగ్గించి) ఏం చెప్పను బాబూ...ఆఖరికి ఆ పిల్ల భాగం తీసుకున్నాను....పెద్దజట్టీ అయింది ఒకరోజు నాకూ వాడికీ... (పళ్లుకొరికి) వాడు...ఆ రాడీ ఆ పిశాచి...నాకూ....ఆ పిల్లకీ నా కూతురులాటి పిల్లకీ...

వ్యక్తి : (తలదించుకొని) ఊఁ.

సైద : నే నసలు పొరుషపోడ్ని...పీకపోయినా, ఏమిటయినా వాడి ఊసే మానుకుందామని పంతంపట్టేను...కాని ఇలా అయిపోతుందని అనుకోలేదు...

వ్యక్తి : తలఅయిందిగా...ఈ గడ్డాం ఇంక తీసేయి...

సైద : (కత్తెరబల్లమీదపెట్టి, కత్తితెచ్చినూరుతూ) వాడు మరి నా కంటబడలేదేబాబూ. అందరిముందూ ప్రమాణికం చేసేను ...నాకేమిటయినా సరే...వాడు కనిపిస్తేచూత్రం... కత్తితో పరా పరా పీకకోసెస్తానని... నా బలం ఎలా ఉండేదనుకున్నారుబాబూ...అప్పుడు!

వ్యక్తి : అప్పుడు నీ కంతకోపం ఉండడం సహజమే...కాని, నిజంగా నీ కొడుకు కనిపిస్తే వాడిపీక సరికేగలవా?

సైద : వాడుకొడుకా బాబూ నాకు! తమ రెలా అంటున్నారు.

వ్యక్తి : నీ రక్తం అతనిలో లేదంటావా?

సైద : ఏమయినాసరే...వాడు కనిపిస్తేమట్టుకు ఆపని చేసి ఉందును...

వ్యక్తి : ఏవో పొరపాట్లు జరుగుతూ ఉంటాయి సయిదయ్యా. అంతమాత్రానికి కొడుకుని, కన్నకొడుకుని, చంపేస్తానని తండ్రి పగపట్టడం చాలా విచిత్రంగాఉంది...ఆ నిమిషాని కలా ఉంటుంది. కాని కొన్నేళ్ళయాక నీ కొడుకుని నీకు చూడాలని తప్పకుండా ఉంటుంది...క్షమించాలని ఉంటుంది...

సైద : ఏమిటిబాబూ! తమ రలా అంటున్నారు...
(దగ్గరగావెళ్లి గడ్డాం గియ్యడం మొదలెడతాడు)

వ్యక్తి : మనం మనుష్యులం సైదయ్యా. పొరపాట్లుచేస్తూ ఉంటాం. నీ కొడుకుసుంతె మారిపోయి ఉండొచ్చు... అతను తిరిగి మనిషిగా మారిపోయి ఉండొచ్చు—చేసిన దానికి ఎంతగానో పశ్చాత్తాపపడి విచారిస్తూ ఉండొచ్చు.

సైద : వాడా! వాడి సంగతి నాకు తెలీదా బాబూ...ప్రతి రక్తకణం విషంగా మారిపోయింది...మరింక అది బాగు పడుతుందా?

వ్యక్తి : గుండె సరిగా పనిచేసి, చెడురక్తం మంచిదయిపోయి ఉండొచ్చు...

సైద : కాదు బాబూ...
(గడ్డాంగీసే పనిలో ముఖంపైకెత్తి ఎందుకో ముఖంలోకి వింతగా చూస్తాడు)

వ్యక్తి : ఏం? అలా చూస్తున్నావ్?

సైద : తమని ఎక్కడో చూసేనుబాబూ ఇదివరకు....

వ్యక్తి : (తత్తరపాటులో) నన్నా!!

సైద : ఔనుబాబూ!

వ్యక్తి : ఏదో పొరపాటు—

సైద : కాదుబాబూ...ఎక్కడో చూసేను...

వ్యక్తి : నే నిక్కడికి రాలేదే ఎప్పుడూ...

సైద : ఆఁ! తెల్సిందిబాబూ...వాడు...

వ్యక్తి : ఎవరు?

సైద : వాడు...నా కొడుకు...మీలానే ఉండేవాడు...ఎంత దగ్గరపోలిక...

వ్యక్తి : నన్నే నీ కొడుకంటావేంటి, కొంపతీసి...

సైద : ఛాఛా! తమకీ ఆ పిశాచానికీ పోటాబాబూ...

వ్యక్తి : నా కెందుకో బాగా నమ్మకంగా ఉంది. నీ కొడుకు మారి పోయిఉంటాడు మనస్సు ఎప్పుడూ ఒక్కలాఉండదు....

సైద : వాడిసంగతి మరెత్తకండి బాబూ...మసిబొగ్గు పాపిబొగ్గే బాబూ!

వ్యక్తి : దానికి నిప్పంటిస్తే ఎలాఎర్రగా మెరుస్తుంది...?

సైద : ఎంతసేపు బాబూ అది...మళ్ళాఅది పనికి రానిబూడిద ఎంతసేపులో అవాలి...

వ్యక్తి : ఒకప్రశ్న అడుగుతాను సైదయ్యా...నిజమైన జవాబియ్య.

సైద : తప్పకుండా అడగండిబాబూ...

వ్యక్తి : నీ కొడుకే, చేసినదానికి పశ్చాత్తాపపడి, నీ కాళ్లదగ్గర పడి, క్షమించమని, ఒస్తాడనుకో...

సైద : (మాట్లాడడు...మిగిలిన కొద్దిపాటి గడ్డాన్ని తీస్తూఉం టాడు)

వ్యక్తి : నువ్వు క్షమిస్తావా?
(గడ్డాంగియ్యడం పూర్తవుతుంది....సైదయ్య 'పాము' తగిలినట్టు ఉలిక్కిపడతాడు... గడ్డాం క్రిందిభాగాన్ని

తీక్షణంగా చూస్తాడు...అక్కడఉన్న చిన్నమర్రిని తేరి పార చూస్తాడు—)

ఏం పైడయ్యా...

పైడ : (ఆవేశంతో) బాబూ...

(కత్తి ముఖందగ్గరికి తెచ్చి) బాబూ! నా కొడుకే....ఈ ఈ నిముషం, నా దగ్గరికొచ్చి...క్షమించమని అడుగుతే వుంటే నే ఏంచేస్తానో తెల్సునా బాబూ!

(మరింత దగ్గరిగా కత్తి తెచ్చి కత్తితో వ్యక్తి పీకని చూపిస్తూ)

ఆ పీకని, పరపరా కోసేస్తాను బాబూ! ముక్కలుముక్కలుగా కోసెస్తాను బాబూ!

(పైడయ్యముఖం భయంకరంగా ఉంటుంది. అతని పళ్లు వికారంగా పైకిఉంటాయి)

వ్యక్తి : (మొదట కొంత గాభరాపడిపోతాడు. కుదుటపరచుకొని, పైడయ్య ముఖంలోకి అదోరకరకంగానూ, అంతభయంకరంగానూ చూస్తూ) పైడయ్యా! ఇరవైఏళ్ల క్రిందచేసిన తప్పుకి పశ్చాత్తాపపడి క్షమించమనివస్తే. కొడుకుని క్షమించలేవూ? (ఊపిరి బిగపట్టి ముఖందగ్గరగా పెట్టి) నాకే నీలాంటి తండ్రికాని ఉంటే (చేతులు రెండూ పైడయ్య పీక దగ్గరికి తెస్తూ) పీకనులిపి విసిరేస్తాను....పీక నులిపి విసిరేస్తాను!

* పైడయ్య దెబ్బతిన్నట్టు వెనక్కి తగ్గుతాడు. ఇద్దరూ ఒకరిముఖం ఒకరు చూసుకుంటారు ఒక అరనిముషం - ఏదో అర్థం అయినట్టు. వ్యక్తి, చరచరా దుకాణం దిగిపోతాడు... పైడయ్య వెర్రివాడ్లా అటువేపే చూస్తూ ఉంటాడు కత్తి పట్టుకొని—! *



# అష్టదిగ్గజములు

శ్రీ నిడుదవోలు వేంకటరావు

సాహితీసమరాంగణ సార్వభౌముడు శ్రీకృష్ణదేవరాయల కాలమున 'అష్టదిగ్గజములు' అను పేర నెనమండ్రు కవులు విలసిల్లిరట్లుగా తెలుగువారి కందఱకు సుపరిచితమైన విషయము. ఆ కవులందఱును తెలుగుకవులేయని నేటివఱకును వాఙ్మయ చరిత్రకారుల యభిప్రాయము. కాని యీ నడుమ వెలువడిన ఆంధ్రకవి తరంగిణిలో కృష్ణరాయ చరిత్రమున గ్రంథకర్తలు అష్టదిగ్గజములలో నైదుగురు మాత్రమే తెలుగు కవులనియు, తక్కిన ముగ్గురును సంస్కృత కర్ణాటకవులై యుండురను నభిప్రాయమును వెల్లడించియున్నారు. వారట్లు వెల్లడించుటకు కారణము లేవియు నందు తెలిపియుండలేదు—కాగా, పారంపర్యముగా వచ్చుచున్న సంప్రదాయమును బట్టియు, వాఙ్మయ చరిత్రకారుల వ్రాతల ననుసరించియు పరిశీలించినచో, అష్టదిగ్గజములలో ముగ్గురు సంస్కృతకర్ణాటకవులై యుండురను నభిప్రాయ మెంతమాత్రమును సమంజసము కాదనియు, వారందఱు తెలుగువారే యనియు స్పష్టమగుచున్నది. ఈ విషయమునుగూర్చి యిదివఱ కెవరేవిధముగా వ్రాసినది తెలుపుచు, అష్టదిగ్గజము లెవరో నిరూపించుటయే యీ వ్యాసము యొక్క యుద్దేశము. ప్రప్రథమమున నీ వాదమును గ్రంథస్థముచేసిన ఆంధ్ర కవి తరంగిణీ కారులు వ్రాసినదాని నిందుదాహరించుచున్నాడను.

ఆంధ్రకవి తరంగిణి సప్తమ సంపుటము పుటలు. 144—145 లో శ్రీకృష్ణదేవరాయల చరిత్రమున నిట్లు గలదు.

## అష్ట దిగ్గజములు

"రాయల యాస్థానములో దిగ్గజములవలె నెనమండ్రు కవు లుండెడివారని ప్రతీతి కలదు. ఈ యష్ట దిగ్గజములకు కడప మండలములోని తిప్పలూరు అను గ్రామము సర్వాగ్రహారముగాఁ జేసి రాయలు దానమిచ్చెనని యొక శాసనమువలనఁ దెలియుచున్నది. ఈ దాన మెప్పు డిచ్చెనో ఆ దానపరిగ్రహీతలగు నెనమండుగురు కవు లెవరో తెలియదు. ఈ సందర్భమున రాయలు వ్రాయించిన శాసనము లభింపలేదు. ఈ గ్రామమున దొమ్మరిపెన్న మాపు చేయుచు, నితరులు వ్రాయించిన శాసనమునుబట్టి యీ విషయము తెలియవచ్చినది.

ఈ అష్ట దిగ్గజములని ప్రఖ్యాతి గాంచినవా రాంధ్రకవులని చరిత్రకారుల యభిప్రాయము.

"ఇతని యాస్థానమునందు పేరిట నెనమండ్రు తెలుగు కవులుండిరనిమాట పరంపరగా వచ్చుచున్నది. అల్లసాని పెద్దన, నంది తిమ్మన, ధూర్జటి, మాదయగారి మల్లన, అయ్యలరాజు రామభద్రుడు, పింగళి సూరన, రామరాజభూషణుఁడు, తెనాలి రామకృష్ణుఁడు అనెడి యెనమండ్రును అష్టదిగ్గజములని వాడుక కలదు.

ఇందు మొదటి నలుగురును, రామకృష్ణుడును శ్రీకృష్ణరాయల కాలములోనివారు. అతని యాస్థానమునఁ గవులుగా నున్నట్లు నిదర్శనము లున్నవి. కాని తక్కిన ముగ్గురును అష్టదిగ్గజములలోనివారు కారని నా యభిప్రాయము. వారినిగూర్చి ఆయా కవుల చరిత్రము నందు వ్రాయఁదలచితిని.

అష్టదిగ్గజములని ప్రఖ్యాతిగాంచిన వారిలోఁ బైన వ్రాసిన యైదుగురును గాక తక్కినవారు సంస్కృత కర్ణాటకవులై యుందురని నా యుద్దేశము. కృష్ణదేవరాయల కాంధ్రమునిన నభిమాన మెక్కువ యనుమాట నిశ్చయమే. దేశభాషలందు తెలుగు లెస్స యని నుడివినవాఁడే. దీనినిబట్టి అష్టదిగ్గజము లాంధ్రకవులే యని తలంపరాదనియు వారిని యాస్థానమున సంస్కృత కర్ణాట కవులు కూడ గలరనియు వారిని కూడ రాయలు సమానగౌరవముతో చూచెననియుఁ దలంపవలసియున్నది."

పై దానిలో తిప్పలూరి శాసనమునుబట్టి కృష్ణరాయల కాలములోనే అష్టదిగ్గజ కవీశ్వరులకొక యగ్రహారము దానమీయబడినదని, వారి పేళ్లు మనకు తెలియకపోయినను వా రెనమండ్రు కవులని స్పష్టమగుచున్నది. కృష్ణరాయలు దానమిచ్చిన కాలము మనకు తెలియకున్నను, అది క్రీ. శ. 1528 (తిప్పలూరి శాసన కాలము) కి ముందు కాలమని నిశ్చయముగ చెప్పవచ్చును. మఱియు కొంతమంది చరిత్రకారులు నిరూపించినట్లు కృష్ణరాయ నిధనకాలము క్రీ. శ. 1526 ప్రాంతమగుచో, నీ దానకాలము క్రీ. శ. 1520—26 సంవత్సరముల మధ్యవని చెప్పవచ్చును. అష్టదిగ్గజములను శ్రీకృష్ణదేవ రాయలు, తన రాజ్యారంభకాలమున నెలకొల్పియుండెనని శ్రీ నేలటూరివారి యభిప్రాయము.[1]

ఈ తిప్పలూరి శాసనమే కాక, మైసూరుప్రాంతమున నంది దుర్గలో సోమశంకరస్వామి ఆలయమున శ్రీకృష్ణదేవరాయని శాసనములో, నీ యష్టదిగ్గజముల ప్రస్తావనయున్న యీ క్రింది శ్లోకమును కీర్తిశేషులు ప్రభాకరశాస్త్రిగారు ప్రకటించియున్నారు.

శ్లో॥ యత్కీర్తిర్భువనైక భూషణ మభూద్యస్యప్రసాదాన్న రా
స్సర్వేరాజ సమానతా ముపగతా సంప్రాప్య దిత్తంబహు

1. *"Very early in his reign, he constituted an Academy of Telugu Poets, the members of which were known as Astadiggajas. Studies in History of the third Dynasty of Vijayanagara P. 421.*

యః ప్రాక్ప్రా కవిదిగ్గజాః పృథుయశోభారా జగద్భోభవా
యద్దానోదక పాత్ర్యమేవ సరితా మాసీతు శీతాదలమ్.

ఇప్పటికి ముప్పదిరెండేండ్ల ముందు ముక్త్యాల సరస్వతిలో (1 సం. సం. 6. పుట 8) దీనిని వారు ప్రకటించిరి. ఈ శాసన మంతయు నీ తరువాత సంపూర్ణముగ ప్రకటితమైనది.2.

ఇక మొదట నీ యష్టదిగ్గజములను గూర్చి గురజాడ శ్రీరామమూర్తిగారు వ్రాసినది తెలుపుచున్నాము.

కవి జీవితములలో శ్రీకృష్ణరాయల చరిత్రమున 475–477 పుటలలో నిట్లుగలదు—

"కొండవీటి దండకవిలలో నున్న వృత్తాంతమును పురుషార్థప్రదాయిని యీ క్రిందివిధముగఁ బ్రకటించెను.

| కవీశ్వరుల పేర్లు | గ్రంథముల పేర్లు |
|---|---|
| ౧. అల్లసాని పెద్దన్న [ఈయన దూపాటి సీమ కోనాదుల కాపురస్థుఁడు-ఈయనకు నాంధ్రకవితా పితామహుఁడను పేరుగలదు. | ౧ మనుచరిత్రె ౨ రామస్తవరాజము ౩ అద్వైతము. |
| ౨. భట్టుమూర్తి ఈయన భట్టుపల్లె కాపురస్తుఁడు. | ౧ నరసభూపాలీయము ౨ వసుచరిత్రము. |
| ౩. ముక్కు తిమ్మన్న. ఈయన గన్నవరము కాపురస్తుఁడు. | ౧ పారిజాతాపహరణము. |
| ౪. పింగళి సూరన. | రాఘవపాండవీయము. |
| ౫. తెనాలి కాపురస్థుడగు తెనాలి రామలింగము. ఈయన యింటి పేరు ఈశ్వర ప్రెగడవారు. | పాండురంగ విజయము (పాండురంగ మాహాత్మ్యము.) |
| ౬. సీడెప్ప దీక్షిత్తుల కాపురస్థుఁడు రామభద్రకవి. | రామాభ్యుదయము |
| ౭. శంకరకవి. | |
| ౮. ధూర్జటి. | |

ఆ పుటలోనే N. B. లో "శంకరకవి కృష్ణరాయల సంస్థానములోనివాడు కాడని చెప్పవలసియున్నది." అని యున్నది.

అష్టదిగ్గజములను పేర్కొన్న తిప్పలూరి శాసనమునుగూర్చి ఆ గ్రంథమున 520 - 521 పుటలలో నిట్లు వ్రాయబడియున్నది.

తిప్పలూరిగ్రామ మష్టదిగ్గజ కవీశ్వరులకు సర్వాగ్రహారముగా నిచ్చినందులకు రెండు దాఖలాలున్నవి. వానిలో తిప్పలూరి గ్రామమునకు దూర్పునచొప్ప వాగిలో నున్న శాసనము.

శాలివాహన శకవర్షములు ౧౪౫౦ అగు నేటి సర్వజిత్తు సం. శ్రావణ బ ౩౦ సోమవారము శ్రీకృష్ణదేవరాయల మహారాయుల వారు అష్టదిగ్గజ కవీశ్వరులకు ధారవోసి యిచ్చిన తిప్పలూరి అగ్రహారమునందు దొమ్మర్లు యిచ్చు పన్నులు ఈ గ్రామములోనున్న శివ విష్ణువుల దేవాలయములకు సమర్పించిరి."

పై దానిలో అష్టదిగ్గజముల పేర్లీయబడి యున్నవి గాన నివి యెంతకాలమునుండి వచ్చుచున్నదో పరిశీలింతము.

"కొండవీటి దండకవిలెలో నున్న వృత్తాంతము పురుషార్థప్రదాయిని యీ క్రిందివిధముగ ప్రకటించెను" అని వారు వ్రాయుటచే నీ విషయమును పురుషార్థప్రదాయిని నుండి గ్రహించినటుల స్పష్టము. పురుషార్థప్రదాయిని ప్రాచీనాంధ్ర వార్తాపత్రికలలో నొకటి. గురుజాడ శ్రీరామమూర్తి పంతులుగా రీవృత్తాంతము ప్రకటించినది. క్రీ. శ. 1893 లో నైనను, పురుషార్థప్రదాయిని పత్రికయంతి కిరువదేండ్లు ముందుగా వెలసినది. అది క్రీ. శ. 1872 లో బందరులో ప్రారంభమై క్రీ. శ. 1874 వఱకును రెండేండ్లుమాత్రమే నడచినది. దీనితరువాతనే వీరేశలింగము పంతులుగారు తమ వివేకవర్ధనిని ప్రారంభించినారు. కాబట్టి పురుషార్థప్రదాయినిలోని వృత్తాంతము క్రీ. శ. 1874 నాటిది యగుటచేత నిప్పటికి యెనుబదియేండ్లనాటిది యని చెప్పనొప్పను. అప్పుడు ప్రకటితమైనది కొండవీటి దండకవిలెనుండి సంగ్రహింపబడినది కదా! దండకవిలెలు, మెకంజీ దొరవారికాలమున క్రీ. శ. 1810 ప్రాంతమున వ్రాయబడినవి. కాబట్టి రమారమి నూటయేబదియేండ్ల క్రిందటనుండియు అష్టదిగ్గజముల పేళ్ళు పరిచితములైనవి యని నిశ్చయింపవచ్చును.

ఇక్కడ ముఖ్యమైన విషయ మేమనగా పై పట్టికలో నిచ్చిన అష్టదిగ్గజముల పేళ్ళకున్న నేటికి మనకు తెలిసినవానికిని స్వల్పభేదము లున్నను వారందఱును తెలుగుకవులేయని మాత్రము నిశ్చితముగు చున్నది.

మఱియును మొదట అష్టదిగ్గజ కవీశ్వరులను గూర్చి తెలుపు తిప్పలూరి శాసనమును నుదాహరించినది శ్రీ రామమూర్తిగారే. వారే పై పట్టికలో "శంకరకవి—కృష్ణదేవరాయని సంస్థానములోనివాడు కాడని చెప్పవలసి యున్నది" అని వ్రాసియున్నారు. అయినను వా రిచ్చిన పేళ్ళ ననుసరించి, అష్టదిగ్గజములలోని వారందఱును నాంధ్రకవులనుటలో సందేహము లేదుగదా!

2. వీరేశలింగముపంతులుగారు, ఆంధ్రకవుల చరిత్ర ద్వితీయ భాగమున కృష్ణరాయ చరిత్రయం దీ విషయము వ్రాసియున్నారు. పింగళి సూరన రామరాజభూషణ రామకృష్ణులు—కృష్ణదేవరాయని కాలములోనివారు కారని వ్రాసియున్నారు. మఱియు రామభద్రకవి రామాభ్యుదయము రచించిన యయ్యలరాజు రామభద్రుడే యనియు, మొదట కృష్ణరాయల కాలమున సకల కథాసార సంగ్రహమును, అవెనుక కృష్ణరాయ నిర్యాణానంతరము రామాభ్యుదయము రచించెననియు నందు నిరూపించియున్నారు.

(పుట 27. 1949 ముద్రణము.)

3. కీ. శే. చిలుకూరి వీరభద్రరావుగారు జీర్ణకర్ణాట రాజ్య చరిత్ర 15 వ ప్రకరణము (పుట 209) లో వీరేశలింగముగారి ననుసరించియున్నారు. ఇది 1908 లో మంజువాణిలో ముద్రితము.

4. కీ. శే. కొమఱ్ఱాజు వెంకట లక్ష్మణరావుగారు—పై యిరువుర ననుసరించిరి.

5. కీ. శే. ప్రభాకరశాస్త్రిగారు చాటుపద్య మణిమంజరి ద్వితీయభాగమున, కందుకూరి రుద్రకవి విషయముల తెల్పిరి.

"అష్టదిగ్గజము లనఁబరగు కవీశ్వరు లెనమండ్రును రాయల యాస్థానమండలమున నెనిమిది దిక్కులను నెనిమిది సింహాసనము

2. *Bulleti n of the Governdment Oriental Manuscripts Library. Vol. 2. No. 2. P. 41 - 57. Edited by T. L. Narasimha Rao.*

లపై నెలసియుండెడివారని యనుచున్నది. అందు రుద్రకవి యీశాన్య సింహాసనమువాఁడైనాఁడు" పుట. 28.

"రుద్రకవి రాయల యాస్థానమున పంద్రెండేండ్లు వసించెను" పుట. 29.

రామభద్రకవి, పుశ్తేటి రామభద్రకవియని తొలుత తెలిపినవారువారే.

పైని వ్రాసిన విశేషములు ప్రాచ్యలిఖిత పుస్తకశాలలో R. 764 సంఖ్యగల "రుద్రకవి విషయము" అను గ్రంథములో నున్నవి.

6. డాక్టరు నేలటూరి వేంకటరమణయ్యగారు పూర్వ ముదాహరించిన గ్రంథములోనే, అష్టదిగ్గజముల పేళ్ళ నిట్లిచ్చియున్నారు. (పుట 421)

*Peddana - Timmana - Dhurjati (Senior) - Mallana Ramarajabhushana- Ramakrishna - Pingali Surana and Rudra are said to have been the members of the Academy over which the Raya himself presided.*

"పెద్దన—తిమ్మన—ధూర్జటి (ప్రథముఁడు) మల్లన—రామరాజ భూషణుడు—రామకృష్ణుఁడు. పింగళిసూరన, రుద్రకవి—వీరు కృష్ణదేవరాయ లధ్యక్షుడుగానున్న అష్టదిగ్గజ కవిసంఘములో సభ్యులు—"

ఈ అష్టదిగ్గజములనుగూర్చి వ్రాసిన వా రిచ్చిన పేళ్ళన్నియు పాఠకుల సౌకర్యముకొఱకు నీ క్రిందివిధముగా చూపుచున్నాము.

| గురుజాడ శ్రీరామమూర్తి 1893 | వీరేశలింగము 1895 | చిలుకూరి వీరభద్రరావు 1903 | కొమర్రాజు లక్ష్మణరావు 1915 | ప్రభాకరశాస్త్రి 1922 | డా॥ నేలటూరి వేంకటరమణయ్య 1935 |
|---|---|---|---|---|---|
| 1. అల్లసాని పెద్దన | అల్లసాని పెద్దన | అల్లసాని పెద్దన | అల్లసాని పెద్దన | అల్లసాని పెద్దన | అల్లసాని పెద్దన |
| 2. ముక్కు తిమ్మన (నంది) | ముక్కు తిమ్మన (నంది) | ముక్కు తిమ్మన (నంది) | ముక్కు తిమ్మన (నంది) | ముక్కు తిమ్మన (నంది) | ముక్కు తిమ్మన (నంది) |
| 3. భట్టుమూర్తి | రామరాజ భూషణుఁడు | రామరాజ భూషణుఁడు | రామరాజ భూషణుఁడు | భట్టుమూర్తి | రామరాజ భూషణుఁడు |
| 4. పింగళి సూరన | పింగళి సూరన | పింగళి సూరన | పింగళి సూరన | పింగళి సూరన | పింగళి సూరన |
| 5. తెనాలి రామలింగము | తెనాలి రామకృష్ణుడు | తెనాలి రామకృష్ణుఁడు | తెనాలి రామకృష్ణుఁడు | తెనాలి రామకృష్ణుఁడు | తెనాలి రామకృష్ణుఁడు |
| 6. రామభద్రకవి (రామాభ్యుదయము) | అయ్యలరాజు రామభద్రకవి | అయ్యలరాజు రామభద్రుఁడు | అయ్యలరాజు రామభద్రుఁడు | పుశ్తేటి రామభద్రయ్య | రుద్రకవి |
| 7. శంకరకవి | మాదయ్యగారి మల్లన | మాదయ్యగారి మల్లన | మాదయ్యగారి మల్లన | కవిరాట్టు | మాదయ్యగారి మల్లన |
| 8. ధూర్జటి | ధూర్జటి | ధూర్జటి | ధూర్జటి | రుద్రకవి | ధూర్జటి |

పై పట్టికలలో భటుమూర్తిలేక, రామరాజ భూషణుఁడును, పింగళి సూరనయు, రాయల కాలమునకు వెనుకనున్న వారని చరిత్రల మూలమున వ్యక్తమగుచుండుటచేతను, వారు కవులుగా గ్రంథకర్తలుగా ప్రఖ్యాతి చెందుట క్రీ. శ. 1550-60 ప్రాంతమగుటచేతను అష్టదిగ్గజములలో వారిని చరిత్రకారులు పరిగణింపుటలేదని—ముందు తెలిపితిని. పై యిద్దరును కృష్ణరాయలవారి కాలమున యువకవులుగా నున్నట్లు మనకు నిదర్శనము లుండుటచే అష్టదిగ్గజములలో తరువాతి కాలమువారు, వీరిని చేర్చియుందురు. వారికాలమును గూర్చి మనకు నేను సునిశ్చితముగా తెలియుటచేత, మిగిలిన యారుగురినిగూర్చి మొదట చర్చించి, ఆ వెనుక తక్కిన యిద్దరిగూర్చి తెలిపెదను—ఈ ఆర్గురిలో 1 అల్లసాని పెద్దన-2 నంది తిమ్మన 3 మాదయ్యగారి మల్లన. వీరినిగూర్చి వివాదమే లేదు. రాయవాచకమున 116 పుటలో నిట్లు చెప్పబడి యున్నది. "రాయలవారున్నూ చాలా సంతోషపడి ముక్కుతిమ్మయ్య అల్లసాని పెద్దయ్య మాదన గారి మల్లన మొదలైన కవీశ్వరులతో కృతులందుకోవలెనని కవితా నాయకులతో పలుకరించి ఆ తీరున అయ్యాని. అనంగా కుళ్ళాయి, కఱ్ఱాయితాళి చేకట్లు, జేసరి పేరులు, కోక తాకలుయిచ్చి, పారిజాతాపహరణమున్నూ, మనుచరిత్రాను చెప్పమని అవతి యిచ్చినారు."

కృష్ణరాయ విజయమున (కుమారధూర్జటి కృతిము) పై మూడు పేళ్లతోడను మనుచరిత్ర మెుక్కటిమాత్రమే పేర్కొనబడి యున్నది.

సరస సాహిత్యరచన విస్ఫురణ మెఱయ
పారము ముక్తి మాదయ గారి మల్ల
నార్యుఁడల యల్లసాని పెద్దార్యవరుఁడు
ముక్కు తిమ్మన మొదలైన ముఖ్యకవులు

3-43

వినుతించిర ప్పుడువారికి
కనకాంబర భూషణములు ఘనతనొసగి

3-44

బంధుర కవీంద్రకృతులలోఁ బ్రాభిఁగన్న
మనుచరిత్రాది కృతులంది మహిమఁ జెలఁగి

సకలసామ్రాజ్య వైభవసరణి మెఱయ
ధరణియేలుచునుండె నద్ధరణి విభుఁడు

4-142

4. ధూర్జటి-ధూర్జటి వంశీయులగు కుమార ధూర్జటి లింగరాజీ కవి చెప్పియుండుటచే నీతడు కృష్ణరాయల కాలమున అష్టదిగ్గజములలో నొకడని నిశ్చయముగ చెప్పవచ్చును.

5. తెనాలిరామలింగ కవి లేక రామకృష్ణకవి.

ఈ పట్టికలో మొదట రామలింగకవి నామము తరువాత రామకృష్ణకవినామము పేర్కొనుట గమనింపదగినది. శ్రీ ప్రభాకర శాస్త్రులవారి ఉద్భటారాధ్య చరిత్ర పీఠికమూలమునను, శ్రీ డాక్టరు నేలటూరి వేంకటరమణయ్యగారి 'తెనాలిరామకృష్ణుఁడు' అను వ్యాసము మూలమునను నీత డష్టదిగ్గజములలోని వాఁడని నిశ్చితమైనది.

6. రామభద్రకవి—మొదటిపట్టికలో రామభద్రకవిని రెండు మూడు నాలుగు పట్టికలు అయ్యలరాజు రామభద్రుఁడని, 5వ పట్టిక పుస్తేటి రామభద్రయ్య యని పేర్కొనుచున్నవి. రామాభ్యుదయము అను ప్రబంధమును రచించిన, అయ్యలరాజు రామభద్రకవిని, కొన్ని లక్షణగ్రంథములు పుస్తేటి రామభద్రయ్య అని పేర్కొనుచున్నవి. కావున నితఁడే కృష్ణరాయల కాలమున నున్నట్లును, అష్టదిగ్గజములలోనివాఁ డయినట్లును విమర్శకులు వ్రాసియున్నారు. కాని రామాభ్యుదయ రచయితయగు అయ్యలరాజు రామభద్రయ్య కృష్ణదేవరాయల కాలమువాఁడు కాఁడు. అతఁడు సదాశివరాయల కాలమునను, కృష్ణరాయని అల్లుఁడగు అళియరామరాయని కాలమునను జీవించియున్నట్లు, అయ్యలరాజు వారి వంశవృత్తాంతమును, రామాభ్యుదయమును చెప్పుచున్నవి. రామాభ్యుదయము అళియ రామరాజు మేనల్లుఁడగు గొబ్బూరి నరసరాజున కంకితము. క్రీ. శ. 1560 - 70 ప్రాంతము నాటిది. కాబట్టి రామాభ్యుదయ కర్త అష్టదిగ్గజములలోవాఁడు కాఁడని చెప్పవచ్చును.

అయ్యలరాజు రామభద్రుఁడు గాక, కృష్ణరాయల కాలమున రామభద్రకవియని పేరితో మఱియొక కవి యున్నాఁడు. అతఁడు సకల కథాసార సంగ్రహము అను కృతిని కృష్ణరాయల ప్రోత్సాహముచే రచియించియున్నాఁడు—అది తొమ్మిది యాశ్వాసములు గల పద్యకావ్యము—తొమ్మిదవ యాశ్వాసమున మధ్యను గ్రంథ మాగిపోయినది—సంస్కృతమున రాయలవారు [1] సకల కథాసార సంగ్రహము రచించిరి గదా! దాని ననుసరించి రామభద్రకవి తెలుగున దీన్ని రచించినాఁడు. తెలుగు సకల కథాసార సంగ్రహము ముద్రితము కాలేదు—ఇందలి యవతారిక భాగము మాత్రము (మొదటినుండి షష్ఠ్యంతముల వఱకు ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక సం. 27 సం. 1 లో ప్రకటితమైనది.

సకల కథాసార సంగ్రహమున, రామభద్రకవి తెలుగున ప్రాచీనులయు, తన సమకాలికులయు కవుల కృతులనున్న పద్యములను బోలిన పద్యములను చాల రచియించియున్నాఁడు. అందు, తిక్కన, అల్లసాని పెద్దనల ననుసరించి పెక్కు పద్యములు వ్రాసినాఁడు. వానిలో సమకాలికుఁడగు పెద్దన మనుచరిత్రము పద్యములకు చాల పద్యములు ప్రతిబింబములు వ్రాసియున్నాఁడు.

---

1. ఆ ముక్తమాల్యదలో 'శ్రుతిపురాణోప సంహిత లేర్చి కూర్చితి సకల కథాసార సంగ్రహంబు'—అను వాక్యమున్నది గదా: ఇందులో కొంత భాగము మాత్రము లభ్యమైనది. అందు వ్యాసతీర్థులవారి ప్రశంస యున్నది. చూ. సకల కథాసార సంగ్రహము. ప్రభాకరశాస్త్రిగారి వ్యాసము.

ఈ విషయము నిరూపించుటకు కొన్ని సంవాదములను రెండు గ్రంథములనుండి చూపుచున్నాను.

సీ॥ వదన సౌందర్య విస్తారాంబుధి సంజాత
        కంజంబులన వాని కన్నుదోయి
మదన సామ్రాజ్య సమ్యక్ పీఠిక యనంగ
        సరసమై వాని వక్షస్థలంబు
కర్ణకుండల రత్నకాంతులఁగొన నిక్కు
        వగల మీఱెడు వానియొను భుజములు
అరుణ ప్రవాళ సంతతి రుచిసంపద
        నదలింపఁజను వాని మృదుపదములు
గీ॥ సింగముల భంగములఁ జెందఁజేయు నడుము
దంతురుని యందమును నొందఁజాలు నగురు
వాసినవుఁ బువ్వులను నవ్వు నాసికయును
గప్పుకప్పున నొప్పిన కొప్పు శిఖయు

సకల కథాసార సంగ్రహము. 3 వ ఆశ్వాసము 127 పుట.

సీ॥ వదన ప్రభూతి లావణ్యాంబు సంభూత
        కమలంబులన వీని కన్నుల మఱు
నిక్కి వీనులతోడ సెక్కసెక్కములాడు
        కరణినున్నవి వీని ఘనభుజములు
సంకల్ప సంభవాస్థాన పీఠిక పోలె
        వెడదయై కనుపట్టు వీని యురము
ప్రతిఘటించు చిగుళ్లపై సెజ్జవాఱిన
        రీతి నున్నవి వీని మృదుపదములు
తే॥ నేరచేటి యసల్ దెచ్చి నీరజాప్తు
సానఁబట్టిన రాపొడి చల్లి మెదిపి
పదను సుధనిచ్చి చేసెనో పద్మభవుఁడు
వీనిఁ; గాకున్నఁ గలదె యీ మేని కాంతి.

మనుచరిత్ర. 2-36.

ఉ॥ అటఁ జని కాంచె భూమిసురుఁ డంబరచుంబి శిరస్సరిజ్ఝరీ
పటలముహుర్ముహుర్లుఠదభంగతరంగ మృదంగ నిస్స్వన
స్ఫుటనటనానురూప పరిఫుల్లకలాప కలాపిజాలమున్
గటక చరత్కరేణుకర కంపితసాలము శీతశైలమున్.

—మనుచరిత్ర.

ఉ॥ అటఁ జని కాంచె భూమిసురుఁ డంబరచుంబిత వింధ్యచారు వి
స్ఫుట ఘనమూర్ధ్ని నిర్గత సుశోభిత పుణ్యశిరస్సరిజ్ఝరీ
పటల ముహుర్ముహుర్లుఠదభంగుర నూత్న తరంగ సంగతో
త్కట వర ఫేన నిర్జిత సుధాంబుధి మహానది నర్మదా నదిన్.

సకల కథాసార సంగ్రహము.

మ॥ అని మేషత్వము మాన్పె దిత్తరపు మాప స్వేదశాంత్యర్థి మా
న్పె నవస్వేద సమృద్ధి బోనకళ మాన్పెన్ మోహవిభ్రాంతితో
డనె గీర్వాణవధూటికిన్ భ్రమరకీటన్యాయ మొప్పన్ మను
ష్యనిభావించుట మానుషత్వము మెయిన్ జూపటెనా వత్తరిన్

—మనుచరిత్రము.

ఎంతోసేపు మైమరచి నిదరోదామని చేసిన ప్రయత్నం విఫలమయ్యింది. అయినా కళ్లుమూసుకునే పడుకున్నది. ఆత్రం ఆగక గడియారం ఇటుతిప్పి చూసుకున్నది. తొమ్మిదన్నరకూ అయిదు నిమిషాలు తక్కువ - వీధిసద్దుమణిగింది. అయినా అతడు వచ్చేజాడ తెలియడంలేదు. కాలం గడిచిందని వూహించుకునే వరికి ఆకలి పేగులు గుర్రు మన్నయ్. ఇప్పుడు తనేమీ చేసుకు తినగల స్థితిలోలేదు. కాఫీ అయినా పెట్టుకుంటే బాగుండును, అనుకున్నది, వెంటనే తోచింది మరోకగంట వేచిచూస్తే బాగుంటుందేమో అని. బట్టలు మార్చుకుని అద్దంలో మొహం చూసుకుంటే కళే లేదు; డొక్కపోయినట్టుంది. ఉగ్గిమీద చేత్తో రాచుకుంటూ 'తను అందవికారినా' అనుకుంది. కాదని హృదయం విశ్వాసం పలికింది. తన కెప్పుడూ అందాన్ని గురించిన ఆలోచనే రాలేదు. ఒకరికి అందమైనదిగా కనబడాలని ప్రయత్నించలేదు కూడా. రాధ అన్నాడు, నీలాటి సొగసుగల చెలికత్తె ప్రక్కన వుంటే తలెత్తుకు తిరగగల'నని. అది అతని హృదయాంతరాళంనుండి వచ్చిన మాటేనా? తనను సన్నిహితురాల్ని చేసుకోవడానికి వేసిన యెత్తా? అతని మెచ్చికోలు తనని ఉన్నతిస్థాయికి తీసుకుపోయిందా మానసికంగా? అదే తన జీవిత చరమ లక్ష్యమా?—అతి డంతి హృదయం లేకుండా అనివుంటాడా? అయినా అతను తన కేమిటి? ఈ ప్రశ్న తిరిగీ రావడంతో గిజాటుగా కణతలు వేళ్ళతో నొక్కుకుంటూ వాలిపోయింది.—

వో క్రమాలకి తలుపుతడుతున్న చప్పుడయింది. మారు పలకకే పలికే వోపిక లేక కొన్ని క్షణాలపాటు కళ్లప్పగించి చూస్తూ వుండిపోయింది. అతను తన పరిస్థితి ఊహించినవాడిలా తలుపు తట్టడం మాని పేరుపెట్టి గంభీరంగా పిలుస్తున్నాడు. ఆ స్వరం చెవుల బడడంతో అంతవరకుండిటి ఆలోచనలు వెనకబడి ఒక నూతనోత్సాహం పొంగివచ్చినట్లయింది—అది ఆమెలోని మానసిక బలహీనతా, అమాయికత్వమా? నిర్ణయించుకోలేక చివాల్న లేచివచ్చి గడియ సడలించింది. అతను నేరుగా వచ్చి చేతులోవున్న పొట్లాలు బల్లపై పెట్టి కుర్చీలో కూర్చుంటూ "భోంచేశావా?" అని అడిగాడు. 'చేశావని చెబితే!'—అతనియెదుట తను అబద్ధమాడలేదు. ఒకవేళ అలాంటి పొరపాటు జరిగినా మొహంమీంచి కళ్లల్లోకి చూసి అంతర్యాలు చదువుకునేపాటి తీక్ష్ణదృష్టి అతనిది. 'లేదు' అని చెప్పేసింది సుందరి.

'ఆ పొట్లాలిలా యిచ్చి స్టౌలు దగ్గరకు లాక్కో' అని చేయి చాచాడు రాధ.

'నాకు 'ట్రాన్స్ఫర్ మెమో' ఇచ్చారు, ఇవ్వాళనించే ట్రాన్సిట్' ఈ అశుభాన్ని తన నోటితో ఉచ్చరించే శక్తి లేదన్నట్టు వణుకుతున్న కంఠంతో అన్నది సుందరి అతడి చేతికి పొట్లాలు అందిస్తూ.

"తెలిసే ఇప్పుడు వచ్చాను, ఇక్కడ యేం గొడవ పడుతున్నావో అని. ఆవేశం జాస్తి నీకు, కొంపోయినా; మళ్ళీ చంటి పాపవి కావు." రాధ పొట్లాలు విప్పి పదార్థాలు సగం పంచి వేశాడు. తిరిగీ యిలా అందుకున్నాడు—

"కానీ, ఎప్పుడూ—పెళ్ళైనాసరే—లంఖణం బదుకోవడ నేర్చుకోకు. కడుపు కాల్చుకుని సాధింపగలిగింది బహు తక్కువ" అంటూ వొక్క సాదా లడ్డూ వొడుపుగా నోటి కందించాడు.—

అతడన్న ఆ మాటతో తిరిగీ పాతపుండు రేగినట్లయిందామెకు. అతను యీధోరణిలో యిలా యెందుకు మందలెట్టినట్లు? ఇకే కడసారి వప్పగింతా? ఈ వొక్కమాట అని తనను వేధించడానికే యిప్పుడు అదరాబదరా పరుగెత్తుకు వచ్చాడా? ఈ అవస్థలూ అతడనే ఆమాట తనపై యెంతటి నిప్పుల గాడ్పులు విసురుతుందో వూహించుకోలేకనే అన్నాడా? తెలిసి తెలిసి యెందుకింత దారుణం తలపెట్టినట్టు? ఈ మాటతో తనయెడల అతని కర్తవ్యం, బాధ్యత ముగిసిపోయినట్టే భావించి అంటున్నాడా?—ఆకలి సెగలకు తోడి ఆలోచనల పొగలు మరింత కమ్ముకుని గజిబిజి చేస్తుంటే ఆమె యేటూ తోచక ఏమీ అనలేక అతని వంక తదేకంగా చూస్తూ వుండిపోయింది. "మంచినీళ్లు" అన్న అతని పిలుపుతో ఉలిక్కిపడి అక్కణ్ణించి లేచి నడిచింది.

"పోనీ అతడే తనని పెళ్లి...చేసుకోకూడదూ? అందుకు తను సిద్ధమేనా? అతని అంతస్థుకు తను తగదా? అంతస్థు? ఎవరి తాహతును ఎవరు నిర్ణయించగలరు? హృదయంలేని స్వార్థపరత్వాన్నే అతనూ పట్టుకు పాకులాడుతున్నాడా యిన్నాళ్లూ? తన యెడల ఆత్మీయతను ప్రకటించి యెన్నిసార్లు కొండెక్కించలేదు?—మంచినీళ్ల గ్లాసు బల్లపై పెడుతూవుండగా అనిశ్చితత్వం ఆట్టేసేపు ధరించలేనన్న, అతడి మాటలు స్ఫురణకువచ్చి, కళవళంగా వొణికిపోవడంతో వేళ్లు పట్టుతప్పి గ్లాసు చెయిజారి కిందపడిపోయింది. అతను తలెత్తి సూటిగా ఆమె మొహంలోకి చూశాడు; అన్నాడు.

"అనుకుంటూనే వున్నా" అంత పనిచేస్తావని, ఏదో అనుకుని మరేదో చెయ్యబోవడం తెలివితక్కువ. తాత్కాలిక ఉద్రేకాలకు లొంగిపోతే ఆశించిన ఫలితం అందక పోగా పర్యవసానం భయావహంగా వుంటుందని తెలియదూ? అది గ్రహింపజేయడానికే యిన్నాళ్లూ పాటుపడ్డాను. కొత్త బాధలు వచ్చిపడుతున్నప్పుడు వాటిని తట్టుకోవడానికి కావలసిన గుండె నిబ్బరం పరిస్థితులే చేకూరుస్తూ వుంటయ్. ఆ ధైర్యంతోనే, నేనూ లాక్కొస్తున్నాను. ఆపాటి గుండె దిటవులేనివాళ్లకి, భవిష్యత్తు అయోమయంగా వుంటుంది. ఎంతవరకూ దక్కినదే చాలననే తృప్తిలో వున్నవాళ్లకు ఏ బాధా వుండదు. నాలుగు లడ్డూలు తిని నీళ్లుతాగి ఆకలి చల్లార్చుకో! అన్నీ తీరుబడిగా ఆలోచించుకోవచ్చు, అర్థంలేని ఆరాటాలకు పోయి మనసు పాడుచేసుకోవడం మంచిది కాదు." అంటూ అక్కణ్ణించి లేచివెళ్లి గడియారం బల్లమీద పెట్టి వున్న పొట్లాం యేమిటో అని విప్పి చూడబోతున్నాడు.—"నీ వేదాంతాలు నాకేమీ అక్కర్లేదు" అన్నది సుందరి; నిరుత్సాహం వెలువరించిన ఆవేశం గుండెల్లో గుబులుగా రగిలిస్తూ వుంటే—

అతడన్ని విషయాలలాగే ఆ మాటలనూ గాఢంగా తీసుకోక చులాగ్గా సమాధానం చెప్పాడు. "అర్థం కాని మాటలన్నీ వేదాంతాలే అనుకుంటారు చాలామంది. నిజానికి వేదాంతం చెప్పే

తోవాతు నాకు లేదు. విన్నే యోగ్యత నీకూ లేదు. జీవితంలో వొక విచిత్రమైన అనుభవాన్ని మాత్రమే కూడగట్టుకుని వచ్చిన మాటలు నావి. విసవబతుకు, రోజా కోకతీరు. ఆలోచించితే చివరికి మిలిగేది యేమీవుండదు-" పొట్లం తిరిగికట్టి బల్లమీద పెట్టాడు—

ఆమె నాలుగడుగులు ముందుకునడిచి ఆవేశంతో యేదో అడగబోయి, గొంతు పెగలక గుడ్లు మిటకరించి చూస్తూ వుండి పోయింది. అవకాశం చిక్కినా అడగదల్చుకున్నది అడగలేక పోవడం, ఈ బలహీనతను ఆసరాగా జాసుకుని అతడు తనను అన్ని విధాలా అణగద్రొక్కుతూ వుండడం గమనించితే ఆమెకు కన్నీరు తప్ప మరేమీ సమాధానం అందలేదు. తన మూగబాధను చూసి అతడు జాలిపడి మరేవో కొత్త పరిష్కారాలు వెదికి తనకు ముందుదారి నిర్దేశించగలడని, విశ్వసించడంలోని బలహీనత, ఇన్నాళ్లీ ఇన్ని విధాలుగా తనను అణచివేస్తున్నదని ఆమె హృదయంలో సుళ్లు తిరుగుతున్నా, ఆ వూహలు అంతటితోనే అంతరించి శూన్యం యేర్పడుతున్నది క్షణంలోనే—

అతిక్రమించలేని ఏదో వొక ప్రాపంచిక సత్యం తననీ తీరుగా కట్టివేస్తున్నదని స్ఫురణకు వచ్చినప్పుడు దానికి తనూ బాధ్యురాలనుకో చేపాటి వెనుకచూపు, మనసులోని మథన, ఇంతటితో దీనిని అంతం చేసుకోంటేనే బాగుంటుందనే అవ్యక్తమైన ఆరాటం, తన జీవితంపై యెనలేని ప్రభావంచూపిన కొన్ని భౌతికవాంఛల ప్రాబల్యం వీట్లతో కూడిన వొక తీవ్రమైన భావశబలత, ఆమె కళ్లల్లో ప్రస్ఫుటంగా కనబడుతున్నా, గ్రహించగలిగే అందుకు ప్రయత్నించని రాఘ ముఖంలో యేవిధమైన వికారమూ కనబడలేదు. పై పెచ్చు అన్ని భౌతికవాంఛలూ వదలి అవ్యక్త ఆనందంకోసం ఆరాటపడి పోయే ఆతురసన్యాసిలా ముఖకవళికల్ని మార్చుకుని పెదవి విరిచి యిలా అందుకున్నాడు— "అనువు, ఏంచేస్తాంమరి? పరిస్థితుల ప్రాబల్యానికి అందరూ తలొగ్గవలసినదే. మరి ఈ సంయోగవియోగాలనేవి శరీరాలకుగాని ఆత్మలకు కావుగదా! ప్రవాహంలో కలిసి కొట్టుకుపోయే కొయ్యగర్రల్లా కొంతకాలం కలిసివుంటాం, మరి యేదో తరంగం గాటంగా తగలగానే యెవరిదారివారు చూసుకో వలసివుంది. ఏమైనా, తోసుకువస్తున్న ప్రవాహాన్ని కాదని నిలవగల వారెవ్వరు? అందుకు సిద్ధమైనప్పుడే జీవితశేషం హాయిగా సాగిపోతుంది."—ఏదో లోకంలోనించి వినబడుతూన్నట్టున్న అతని మాటలు చెవులబడుతున్నా ఆమె చలించలేదు.

తను ఆశించింది యీ పర్యవసానం కొరకేనా? చివరికి తనేం మిగుల్చుకున్నట్టు? దానికి ప్రత్యుత్తరమూ తనే చెప్పుకోవాలి! రాఘ చెప్పే మాటలన్నీ యిలాగే వుంటయ్ అది అతడికి సహజమేనని గుర్తించి వర్తించకపోవడం తనతప్పు కాదూ? అవసరం తీరాక పెదవులకు రాచుకున్న పంచదార నాకేసి హాయిగా దప్పరించి వూరుకుంటారు కొందరు. రాఘ అలాటివారి కోవలోనే చేరుతాడా? తనిప్పుడు ఏమయ్యింది? ఏమీ కాలేదు. మరోలోకపు ప్రాంగణంలోకి అడుగు పెట్టబోతున్నది. ఎక్కణ్ణించి వచ్చావని ఎవ్వరైనా ప్రశ్నిస్తే 'రాఘ దగ్గిర్నుంచి' అని చెప్పుతుందా? అలా యెన్నటికీ జరగదు. తనను పంపినవాడు రాఘ కాదు. తనే అతణ్ణి విడిచి వెళ్లిపోతున్నది. పాతబంధాలు వదిలించుకుని బయటపడుతున్నది. అతనూ అలాగే అనుకుంటాడా!

చివాల్న అక్కణ్ణించి కదిలి గుమ్మంలో అడుగుపెట్టాడు రాఘ. 'సరే వెళ్లివస్తా, వీలుంటే రేపు రైలుదగ్గిర కలుసుకుంటా,' అంటూ అడుగు బైటపెట్టాడు. రావద్దని చెబుదామని నాలుక చివరకు వచ్చిందిమాట. అంతలోనే అతడు వడిగా ముందుకు సాగిపోయాడు.

ఆ మొన్నాడు అతడు వచ్చేసరికే రైలు దాటిపోయింది.





# నన్నయరచనలోని వళిప్రాసములు

శ్రీ రావూరి దొరసామిశర్మ

వళిప్రాసములు తెలుఁగు కవితకనాదిగా నేర్పడిన విశిష్టాలంకార విన్యాసములు; వీఁగు మిక్కిలి తెనుఁగు శబ్దరూప నిర్ణయము నకును వ్యాకరణమునకును మూలాధారములనుట కోవిదుల కెల్లరకుఁ దెల్లంబు. నన్నయ యాదికవి, వాగనుశాసనుఁడు. అతని ప్రయోగములే తరువాతి కవులకు శరణ్యములు. వ్యాకర్తలకు ఛందఃకర్తల కా భట్టారక రచనయే ప్రమాణము. అతని భారత భాగములోని ఛందోవ్యాకరణ విశేషములు సమగ్రముగాఁ బ్రదర్శింపఁబూనుట విద్వాంసుల ముఖ్య కర్తవ్యము. ప్రస్తుతము నన్నయ రచనలో నా దృష్టికి గోచరించిన కతిపయ యతిప్రాస విశేషముల నీ వ్యాసముగాఁ దెలుపఁదలఁచితి.

ఇందుఁ బ్రధానముగాఁ దెలియఁదగు విషయ మొకటి గలదు.

కవిత్రయ భారత పద్యములకుఁ బాఠాంతరములు పెక్కులు పరస్పర విరుద్ధములై పొడకట్టుచున్నవి. ఆ పాఠభేదముల నెల్ల సప్రమాణముగా సమన్వయించి ప్రకటించిననే కాని భారతము నాధారము చేసికొని ఛందో వ్యాకరణముల రచించుట సాధ్యముగాదని నా తలంపు. లక్షణగ్రంథములలో భారత పద్యములు భిన్న భిన్న పాఠములతో నాయాలాక్షణిక మతానుసార ముదాహృతములై యున్నవి. ఇట్లుండుటచే నే పాఠము గ్రాహ్యమో యేది యగ్రాహ్యమో తెలియుట కష్టము. ఉపలబ్ధ ముద్రిత లిఖితప్రతులను లక్షణ గ్రంథోదాహృతులను సంప్రతించి కవిత్రయ భారతమును బ్రకటించుట యాంధ్ర భాషోద్ధారకుల ప్రధాన కర్తవ్యమని నా మనవి.

ఇకఁ బ్రకృతమునకు వచ్చెదను. వావిళ్ళవారి భారత ప్రతి ననుసరించియు నుపలబ్ధ లక్షణ గ్రంథములఁ బరికించియు నన్నయ భట్టారకుఁడు వాడిన యతిప్రాస విశేషములఁ బ్రదర్శించెద.

## యతి భేదములు:

(1) స్వర యతి:— ఇది ప్రసిద్ధముగాన లక్ష్యములు చూప లేదు.

(2) ఋవళి—ఋ - రి - రీ - రె - రే ల మైత్రములు.

ఋత్విజుండైరి విచా + రించి పూజించితే (సభా-2-11)

(ఈ లక్ష్యమును జూపిన లక్షణగ్రంథములు—అప్పకవీయము, కవిజన సంజీవని, సర్వలక్షణసార సంగ్రహము, లక్షణ శిరోమణి.)

(3) ఋత్వసంబంధవళి—ఋకారమునకు ఇ-ఈ-ఎ-ఏ లతో మైత్రి. మహాక్కర—ఇందుండు పినాకి కృష్ణమృగచర్మ + కృతకోపనము. (అరణ్య. 3-97. నన్నయమతమున నిందు 4-వ గణముపై యతి)

(4) శి కారవడి:— ఈవడి భేదమును అనంతామాత్యుఁ డొక్కఁడే చెప్పెను. తక్కిన ఛందఃకర్తలు తెలుపలేదు. 'ఇది విని విస్మయ మంజెఁ, యెదియేనియుఁ జగువుబుద్ధి యేలావొదవుఁగా, పదపడి గ్రంథములన్నియు, వెదకి వెదకి సారమెల్ల వివరింపంగా' అని కృత్యాదిలోఁ బ్రతిజ్ఞ గావించిన యప్పకవియే యీ యతి విశేషమును స్పృశింపకుండుట వింతయయి కానంబడెడి.

అనంతుఁడు 'క్ష స్త్రీలను శారిరజాతి + శ్రీ నడుగ (1-89)' అను పాద ముదాహరించి 'శ్రి-శ్రీ' యతిమైత్రిని జూపెను. కాని యందులకుఁ బ్రయోగాంతరములు మృగ్యములు.

నన్నయ 'కృతిపీఠ్య ధనమెల్లఁ + గ్ల స్త్రిపేశి ఆది-7-133)' అను పద్యపాదమున 'కృ-క్ష' లకు యతిమైత్రి ఘటించియున్నాఁడు. ఈ భట్టారకప్రయోగమును లక్షణకారు లుపలక్షించినట్లు లేదు. నన్నయప్రయోగము నిలకించియే కాఁబోలు శ్రీనాథుఁడు కాశీ ఖండములో 'ఘృతపయోరాశి సం + క్షత్పావకైక మైన' అనుచోట (5-281) శివడిం గూర్చెను. ఈ శివడింగూర్చిన విశేషము లన్నింటిని నా 'శికారయతి' యను వ్యాసమునఁ బ్రదర్శించియున్నాను. (చూ. ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక—జయ—౪ సంచిక)

(5) వర్గయతి—స్పష్టము.

(6) మువిభక్తియతి (పోలికవడి)

విభక్తి మకారముతో — పు-ఫు-బు-భు-లకు మైత్రి —

పొడిచియు వివిధాస్త్ర శస్త్ర + ముల నద్ధతులై (ఆది-2-95)

పోరనఁ దానగ్నిమూర్త + ములతోఁ జెనఁగెఁ (ఆది-2-89)

భువనంబులయందు సర్వ + ములుఁ ద్రిమ్మరుటన్ (ఆది-2-118)

ఎట్టి విశిష్టకులంబునఁ, బుట్టియు సదసద్వివేక + ములు గల్గియు (ఆది-5-58)

భూమతిధాన్యంబు బీజ + ములు వణిజులకున్ (సభా-1-44)

గమనిక:- కేవల మకారయతి కిందుఁ బ్రయోగము గానరాదు.

(7) భిన్నయతి—ధరించు, పోషించు, ఉపమించు— ఇత్యాదులగు ఇంచు గాగము యుక్త క్రియలందు వ్యంజనమునకే కాక స్వరమాత్రమునకును యతిమైత్రి కూర్చనగును. అప్పకవి యీ స్థలములందు వ్యంజనమైత్రి యొక్కటే యాశించె. స్వరమైత్రి యుండరాదని కష్టముగాదు. నన్నయ స్వరమైత్రి పాటించినందులకీ క్రింది పద్యపాదము దిలకించునది—

'సందియం, బీరమణీయ కాంతి నుప + మింపఁగ (ఆది-6-151) (సందియంబు + ఈ రమణీయ—ఉప + మించు)

(8) ఎక్కటివడి—(ఏకతరయతి)

నన్నయరచనలో 'ము, ర, ఱ' అనునవి తమతమకే ప్రత్యేకముగా యతిమైత్రినందు నట్లు గోచరించెడు. అప్పకవి మతమున రేఫద్వయము మాత్రమే యీ యతిక్రిందఁ జేరును. అనంతామాత్యాదులు మిగిలవల నెక్కటి వడిక్రిందఁ జెప్పిరి.

(9) అభేదయతి—ప-ఫ-బ-భ-వలు మిత్రములు.

వబయో రభేదయను సూత్రము ననుసరించి 'వబ'లకు యతి చెల్లును పవర్గమునకుఁ జెందినది బవర్ణముగాన, పఫబభలు నాల్గు వకారముతో నభేదవర్గయతి పేరఁజెల్లునని యప్పకవి అభేద, అభేదవర్గయతులు రెండుచెప్పెను. అనంతాదు లభేదయతి యొక్కటే చెప్పి రెంటెని సంగ్రహించిరి. కొందఱు విద్వాంసులు భారతములోనందు ముఖ్యముగా నన్నయభాగములో అభేయతి ప్రయుక్తముగాదని చెప్పుదురు. అట్టి ప్రయోగములఁ బూర్వలాక్షణికు లుదహరించియున్నను వానికిఁ బాఠాంతరములు వక్కాణించి సమర్థింతురు. పాఠాంతరములు చెప్పఁబూనినచో నెట్టిదాని నేని మార్చవచ్చు. ఇప్పట్టునఁబూర్వ లాక్షణికోదాహృతుల నెల్లఁద్రోసి రాజనుట సంభావ్యముగాదు.

ఒక్క యుదాహృతి చూచుటకు—

'నుతజల పూరితంబులగు నూతులు నూఱిటికన్న సూనృతవ్రత యొక బావి మేలు మఱి + బావులు నూఱిటికన్న (ఆది-4-94) ఇందు రెండవపాదమున 'వబ'లకు యతి. ఈ యభేయతి నివారింప నెంచి 'వ్రతయొక వాపిమేలు మఱి + వాపులు' అను పాఠాంతరము చూపుదురు. బావులను సరళపాఠమును మాని యీ వాపుల యపస్వరపాఠభేదమంటఁగట్ట నేల? రంగకవియు నప్పకవియు నభేదయతికి ఈ పద్యపాదమే యుదహరించింది.

నన్నయ రచనలోని యభేదయతి ప్రయోగములు కొన్ని చూపెద. వేల్పులలోనఁ బెద్దధర్మ + పున్న సత్యమునన్ (ఆది-5-92) విరుఁడగునరుని యేయు న—పారశరావలుల నడుమ + వారింపంగా (ఆది-7-199-రంగకవి) విరువారనునట్టి బుద్ధిని + భేద మెన్నఁడు లేదు (ఆది-8-29;-చింతామణి, అప్ప, లక్షణ, సర్వ)

పరమధ్యానో, పరతేంద్రియవృత్తి నున్న + వాని శమీకున్ (ఆది-2-172; అప్ప, సర్వ, చింతా)

పీనోన్నత కుచముఁబోలె + వెలిఁగెడుదానిఁ (ఆరణ్య-8-292) వ్రతముల సేవపూజలన + పారజపంబుల (అరణ్య-3-78) - లక్షణ. ఘన లబ్ధుల ప్రముచ్చులఁగూ, ర్పని వారలఁబగఱవలని + వారల్పూతి (సభా-1-41) వేణి సరస్వతి + పెన్న గోదావరి (సభా-1-72)

వ, ర్వతము గ్రహించునట్లు తన + బాహులవాని గ్రహించి (అరణ్య-1-311) అప్ప. అ, పారతపోయుక్తులైన + వారికిఁ బడియున్ (అరణ్య-1-371) అప్ప. సర్వ. వెండియుఁ బ్రథమమీఁది పకారమునకు నాదేశముగా వచ్చిన వకారమునకుఁ జెక్కడల నభేదయతి ఘటన ముద్రిత ప్రతియందుఁగానదగు, మచ్చునకు—

పరఁగనవి మనయందు వీ + ద్వడియెనిన్ను (వీడు + పడు; ఆది-4-228) పుణ్యపరుల లోకంబులు, వనియజయస్వర్గ + ఫలము నూవ (ఆది-7-61) భార్యనొక్కయొకటు + వటవర్తి (సభా-2-2)80

ధిషన మెప్పాట వె + ల్వడిఁగఁబోలు (ఆది-1-115)

(10) సరసయతి—ప్రసిద్ధము: లక్ష్యములు చూపఁబడలేదు.

(11) సంయుక్తయతి — సంయుక్తాక్షరమున నేకేకవ్యంజనమునకు యతిమైత్రి కూర్చుట; ఇదియుఁ బ్రసిద్ధము. నన్నయ రచనలో నిందొక విశేషము గానవచ్చెడు.

(అ) క్ష—కషలసంయుక్తము. కషలలో నొకదానికి మైత్రి కూర్చనగు. నన్నయ క్షకారములోని కకారమునకే సర్వత్రయతి పెట్టినట్లు గానవచ్చెడు.

చూ:- క్షేత్రమునందప్రకాశిగతి + కేలన (ఆది-1-108)

క్షోణీ...ది + కుక్కల్, క్షీణోత్సాహ — గీర్వాణ (ఆది-2-12).

వ, క్షితివాతాహతి—వికలా + కారంబు (ఆది-2-92).

ర, క్షారతి—భుజ + గంబుల (ఆది-2-103).

ఈ క్రింది స్థలద్వయమున మాత్రము షకారముతోటి మైత్రి గలదు—చూ—

క్షత్రియ చరిత్రుఁడై పరఁగు + సత్త్వమునన్ మఱి ని సవిత్రికిన్ (అరణ్య 3-186)

అచ్చిన్నాచికలో 'గర్వమునన్, గర్భమునన్' అను పాఠాంతరములు గలవు. మఱొక్కటే; క్షమయు తాల్మియుండఁ + జనదెల్ల ప్రొద్దు (అరణ్య-1-217)

దీనికి పాఠాంతరము గానరాదు.

(ఆ) జ్ఞ—ఇందు చ ఛ జ ఝ శ ష స లలో మైత్రి కూర్చఁబడియున్నది.

తద్భవవ్యాజ విశేషవతి లక్ష్యములు లేవు—అనఁగా ఞ-ణ తోను క-ఖ-గ-ఘ లతోను మైత్రి కూర్చబడదు.

ఉ త్తము, జ్ఞానము...సంహిత (ఆది-1-158)

య, జ్ఞమ్ము...ప్ర + జాపతి (ఆది-2-226)

(12) శంకధ్వాది యతి (పరరూప యతి)

వేదాంత శబ్దమున స్వరమైత్రి పాటింపఁబడినది.

వైరి వే, దండ గండ విదారి ఘోరత + రాసి ధారి భుజార్గళా (ఆది-3-228) ఈ పద్యపాద ముదహరించినారు లాక్షణికు లెల్లరు—(చింతా, అప్ప, కవిజన, లక్షణ, సర్వ, రంగ)

(13) ప్రాది యతి—ఇప్పట్టున వ్యంజన మైత్రియే యధికముగాఁ బాటింపఁబడినది; స్వరమైత్రియు లేకపోలేదు.

వ్యంజన మైత్రి:

ఆదిపర్వము—

గా, స్త్రములు—ఉ + దాత్త (1-10)

భా, రత్యమరాప గోషము ని+రంతర (1-73)
మడుఁగ నికిని ప+మాఖ్య (1-81)
అ, మ్నాయము—స+మంచిత (1-90)
అ, పేక్షించు—అ+ఖేద్యుఁడు (1-99)
వ్యపగత—విచ్చు (1-150)
బ్రహ్మర్షి—ఉ+పాసిత (1-28)
మనిపక—స+మర్పణ (2-43)
ఉ, పాయము—పనుపు (2-53)
ని, రాస—రక్షోభియముల్ (2-124)
ప్రారంభి—పాలన (2-240)
ప్రియపత్నులు—అ+భీష్ట (3-88)
అ, భ్యుదితుండై—బుధనుతుఁడు (3-125)
శ్రీనులుగా—ప్రాప్త (3-142)
అ, పేత—పెరుఁగుచు (4-9)
స, ముల్లసన—మునిశర (4-40)
మీకును—స+మీహిత (4-129)
మహీతల—స+మత్నము; మహీశు—స-మరిత (6-50)
భారద్వాజ—అ, పాయము (7-15)
పడియుట—ప్రారంభించె (7-16)
దానికి శివుఁడు ప్ర-త్యక్షమయ్యె (7-86)
అ, త్యంత—ధర్మువు (7-59)
పంచిన—ప్రాణ (7-120)
మాకు—స+మస్త (7-156)
ప్ర, తీక్షించు—ని-దీర్ఘరముఁగ (7-266)
తల్లి—ఉ+దాత్త (8-53)
సభాపర్వము:—యు, ద్ధమ్ము—ఉ+ద్యగ (1-162)
ధరణి—ఉ+దార (1-241)
ని, రాకృతులు—రాజులు (2-93)
రక్త—ప+రాక్రమ (2-269)
అరణ్య:—అ. పార్థీకృత—పరమార్థ (1-28)
మనమున—స+మగ్ర (1-359)
ప్రీతి—అ+భీష్ట (2-320)
దు, ర్మతి—స+మాప్తి (3-258)
అ, భ్యంతర—ప్రతిపత్తి (3-353)
అ, త్యంత—విది+తప్రతాప (3-353)
స్వరమైత్రిగల పట్టులు:—

మధురాక్కర (ఆది-4-49) దీనికి 4-వ గణము ప్రథమాక్షరముయతి అనఘ,యుప నేత,మఱియు ని+రంతరా, ధ్యాపకుండు

(1 సూర్య - 3 ఇంద్ర - 1 చంద్రగణములు)
ని, ర్థకంబదూర - యవనివీఁద (ఆది-8-31)
ఆ విపినాంతరంబున ని+రంతరనిష్ఠ (సభ-1-138)
అతుల—ని+రంతర (అరణ్య-4-65)
ని, రాగసుండ—సద్గు—ణాన్వితుండ (సభ-1-186)
అప్రమాణమును దు+రాత్మకులకు (అరణ్య-1-282)
అను వివేకమని య+థార్థకంబగు (అరణ్య-4-128)
ఇందు—ఉ+పేంద్ర (ఆది—8-215)

(14) నిత్యసమాసయతి—ఉభయయతి

ఆదిపర్వము:—నా, రాయణునట్లు వాసిగ ధ+రామర కంఠ విభూషణుండు నారాయణభట్టు వాఙ్మయ ధు+రంధరుఁడున్ (1-25)

ఇందు మొదట స్వరమైత్రి రెంటవ్యంజనమైత్రి (అప్ప, సర్వ)
రమణుల్—నా+రాయణు ([illegible]-2-22)
కా, కోదర...హారిత+హోగ్ర (స్వరము-1-125)
సన్మునీశ్వరుఁడు వి+శ్వామిత్రుఁ డితి (వ్యంజనము-4-36) సర్వ.
శమహీనుఁడైన వి+శ్వామిత్రు (వ్యంజనము-7-95)
ఉన్న వీరుండు వృ+కోదరుండు (స్వర-7-195)
ద్వారములన్ మహోదధిర+ధారలు (వ్యంజన-6-305)
సాంగంబులగుచుండ+సకలవేదంబులు (వ్యంజన-4-169) సర్వ.
తనియఁగ—జామ+దగ్న్యుఁడు (వ్యంజన-5.197)
(జమత్+అగ్ని—జమదగ్ని—అనిభేదము)
క్రాలుచునుండనే+కాంతయోగ (వ్యంజన-3-319) సర్వ
కామభోగములకు సదే+కాంతగృహము (వ్యంజన-8-74)
(అప్ప—రంగ—కవిజన—లక్షణ—సర్వ)
సభాపర్వము:—అవివేక—దా+ర్తాండు (స్వర-2-8)
దా, మోదరు...యుక్తను (స్వర; 2-18)

అరణ్యపర్వము:— సాంబుఁడాయుముమచుఁ + జారుధేష్ణుం డిల్గి (అరణ్య-1.159) సర్వ.

పా, రావారరవంబుఁబోలె+ననివార్యములై (అరణ్య-2-56)
దారుణ పరసువున జామ+దగ్న్యులకు (2-262)
జననియుఁబేర్మి+కార్తరాజ (2-151)

దశ+ఋణ - దశార్ణ (ప్రవత్సరకంబల వసనార్ణ దశానా మృణే - వార్తికము) ఋకారమునకిందువృద్ధి 'అర్' వర్ణమాదేశము. పైచరణమున వ్యంజన మైత్రి.

శరాసన బాణాసన ప్రభృతి శబ్దములకు స్వరమైత్రియే పాటింపఁబడియె.

బాణాసన—మహోభుజ (ఆది-5-47)
శరాసన—అసలు (ఆది-5-212)

(15) నఞ్ సమాసయతి.

అనంత, అనేక - ఇత్యాది నఞ్సమాసస్థలములందు స్వరమైత్రియే పాటించినాఁడు నన్నయ. అప్పకవి యీ యతిభేదమును నిత్యసమాసయతి యందే చేర్చెను; ప్రత్యేకముగాఁ జెప్పలేదు. కాని మంచి తిమ్మకవి దీనిని యతిభేదములలోఁ బృథక్కుగా గ్రహించి యుభయయతి ప్రయోగములఁజూపెను. (చూ. సర్వలక్షణసారసంగ్రహము. 2-అ)-132-134 పుటలు. స్వరమైత్రి కుదాహృతులుగొన్ని.

ఆది:— అ, శ్రిత—అనంత (1-6); అనల్ప—అర్చి(2-94),

ఆపన్నగముఖ్యులందఱ, వేఁపున (ఆది-2-45) అప్ప, రంగ, సర్వ.

ఇదిగాక, తేఁగయుఱ్ఱుల...వు, నాగపూగ—అనుపద్య మప్పకవి యాదిపర్వములోనిదిగా నిచ్చెను (అప్ప-3-307) కాని భారతములో నీపద్యము గానరాదు.

వేఁకదఱ్ఱేఁగి కొండి + శిఖులైరి (ఆది-2-100)

(3) సంయుతాసంయుతప్రాస—
క్షత్రియవంశ్యులై...రామమాం
ధాతృ రఘుశిబిపులు (ఆది-2-177)

అప్పకవి దీని నుదహరించె. భారతప్రతిలోను గొందఱు విద్వాంసుల మతమునను 'రామమాంధాతిరఘుశిబిపు' లను పాఠము గలదు. 'ఆనఙ్ఋతో ద్వంద్వే' అను పాణినీయమునుబట్టియు, దాని ననువర్తించు 'ఋర్ద్వంద్వే' అను నన్నయభట్టీయమునుబట్టియు, 'రామమాంధాతృ రఘుశిబిశ' అను పాఠమే యుక్తమని తోఁచెను. దీనివిమర్శకు వ్యాకరణగ్రంథములం దిలకించునది.

(4) వికల్పప్రాస — మానవభుక్ + నివహ — భుఙ్నివహ, వికల్పసంధి.

అగ్నిహోత్రఁజేసి మానవ
భుఙ్నివహము మరణబాధఁ బొందించుచు (ఆది.7-153) సర్వ.

(5) ఉభయప్రాస—ణనలమైత్రి (అనేకణకారమునకు నకారమునకుమైత్రి) ఈక్రిందిపట్టులయందుఁ గేవల నకార ణకారములకుఁ బ్రాసగాననగు. దుర్ణయమున శకుని + కర్ణదుశ్శాసనుల్ (ఆది 3)

ఇందుఁ గొందఱు 'దుర్నయమున' అని పఠింతురు. భారత ప్రతిలో నట్లే ముద్రితము. 'దురస్యత్వణత్వయోః ప్రతిషేధో వక్తవ్యః' అను శాసనమునను సరించి దుర్ణయరూపమే సాధువనఁ జెల్లు.

ఈక్రింది యుదాహృతిమాడుఁడు:—

దుర్నిమిత్తముల్ పుట్టిన + నిర్ణయించి (అరణ్య-1-49)

ఇందు నిర్ణయించుటలో (నిర్ + నయ)ణత్వము సాధ్యము గావ నీప్రాసలాక్షణిక సమ్మతమేయగు.

(6) అనునాసికప్రాస—

ద్రుతమునకు నకారంబు పరంబగుచో మకారంబగు. ఇట్టి యాదేశము ప్రాసస్థలములందుఁ గనఁబడుచున్నది. (చూ. ప్రౌఢవ్యా సంధి 22)

కమ్మని లతాంతముల + కుమ్మెనసి (ఆది-5-138; లతాం తములకున్ + మెనసి - అని విభాగము) రంగ.

ఇమ్ముగ సర్వలోక జను...కం, దుష్యమ్మని (ఆది-1-77).

అమ్మునిపు...వృష్టిఁజే, సెమ్మహాపదులున్ (అరణ్య-3-113) రంగ. అప్పకవి యీ ప్రాసభేదమునకు వ్వేయలక్ష్యములిచ్చెఁగాని నన్నయ ప్రయోగ మొక్కటి చూపఁడయ్యె.

(7) ఇమ్ముగ...కం, దుష్యంబరమున్ - అను పాఠము పై పద్యమున కుండుటచే (సర్వ - లోఁ జూపఁబడినది) 'మ్మ - ంబ' లకుఁ బ్రాసమైత్రి యేర్పడి యప్పకవి చెప్పిన ప్రాసమైత్రి ప్రాసమగును.

(8) స్వవర్గజ ప్రాస—(దధలు).

కాదన కిట్టిపాటి యపకారము తక్కఁ దేక విప్రసంబోధనఁ జేసి చేసె (ఆది.1-125) రంగ, అప్ప.

ద ధ లకుఁ బ్రాసమైత్రి ముద్రిత ప్రతిలోఁ గన్పట్టదు.

వీని తపోహిఁణులెన్న..., రూఢిగా.

చేకుక—రూఢిగ (ఆది-8-156).

పై రెండుచోట్ల రూఢిశబ్దము వ్యస్తముగా నున్నది. రూఢికిఁ దద్భవము రూఢియందు గ్రాహ్యము సేవి ద ధ ప్రాస యంగీకరింపఁ బనిలేదు.

(9) ఋ ప్రాస—(ఋ - ర)

గారవమున నిచ్చి—యా ఋషితోడఁ బుత్తెంచె (ఆది-7-87)

ఆ ఋషికుమారు కట్టిన, చీరలు (అరణ్య-3-104) అప్ప, సర్వ, రంగ.

(10) అభేదప్రాస—(ల-ళ లు)

ప్రల్లదుఁడైన—ద్రెళ్లఁగ (ఆది-1-126)
ప్రల్లదమేది—త్రెళ్లుడు (సభ-2-69)

(11) సంధిగత ప్రాస—

సుందరిఁ బాంచాలేంద్ర సు
తం దోడ్కొని రమ్ము (సభ-2-211)

లయగ్రాహి - కంపిత పుష్పముక - రంద రసముం దుఁగుల - చుండనుము సౌరభము - నొంది (ఆది-5-139).

కిందము శాపము డెందము, నందలఁ పల్ (ఆది-5-142)

ఇంక నిట్టివి పరిశీలించిన మఱికొన్ని విశేషములును గోచరింపవచ్చును.

నన్నయ కృత్యంతరములు:—

లక్షణసారమను ఛందమును, ఇంద్రవిజయము, రాఘవాభ్యుదయమను కావ్యముల సయితము నన్నయ రచించినట్లు లక్షణ గ్రంథోదాహృతులవలనఁ దెలియనగుచున్నది. కస్తూరి రంగకవి లక్షణ సారేంద్రవిజయములనుండి పద్యముల నుదహరించె.

లక్షణసారమున 27 యతిభేదములు చెప్పఁబడినవని 'స్వరవర్గ ప్లుతముల్...ఇర్వదేడేయతుల్' (ఆనందరంగ-3-13) అను పద్యమువలన దెలియుచున్నది. ఇప్పద్యమే తిక్కనకవి వాగ్బంధన మను ఛందములోనిదిగా నొసఁగఁబడి యున్నది. (చూ. తంజావూరి పుస్తకభాండాగారము తెనుఁగు గ్రంథముల కేటలాగు నెం. 703) పై కృతిద్వయమువల్లఁ దెలియవచ్చు యతిప్రాసవిశేషములు—

(1) అర్ధబిందుప్రాస (ఖండాఖండప్రాస) లక్షణసార పద్యము రంగ-3-46)

(2) వర్గప్రాస (థ-ద, ద-ధ)—లక్షణసార పద్యము(3-61)

(3) శకారప్రాస (స-శలు)

ఆ సరసిజాక్షి...ఆ, కాశము, ఇంద్రవిజయము (3-103)

(4) గూఢస్వరయతి లక్షణసారము (3-121)

లక్షణసారములో విధిగా నిచ్చిన 'స్వరము తుదనుండు' అను లక్షణము ఛందోదర్పణములో ననంతామాత్యుఁడు వ్రాసిన పద్యముగాఁ గానవచ్చెడు (చూ. ఛందో-1-85).

(5) వృద్ధియతి—లక్షణసారము (3-148)

(6) ఘుష్ యతి—ఆలాప శబ్దోభయయతి (3-232)

(7) చక్కటియతి—దీనినే ముకారయతి యందురు. విభక్తి ముకారమున కిది భిన్నము. బహుల వికల్పములఁదగు వ్యాస+ముని యనంగ—లక్షణసారము (3-261)

(8) అభేదయతి—(ల-ళ-ఱ) ఇంద్రవిజయము (3-278) లళయోర భేదయనియెడు,

చెపమున ప ఫ బ భ లు వాకు నిలిచిన—లక్షణసారము (3-285)

(9) ప్రాకృతాదేశయతి—జ్ఞ-న (అప్పకవి తద్భవాఖ్యయతి) లక్షణసారము (3-298)

ఈ వైకృతులు నన్నయకృతములగుటం గూర్చి కవి చరిత్రకారులు శంకించియున్నారు. రంగకవికిఁబూర్వ మెవ్వ రీకృతులఁ జేకొ్కనినట్లు లేదు. సకలలక్షణగ్రంథ పరిశీలన గావించిన యప్పకవి యేని లక్షణసారాదుల యస్తిత్వమును సూచింపనైనను లేదు, అముద్రితములుగా గ్రంథాలయములందున్న లక్షణగ్రంథముల నన్నింటిని బరిశీలించినఁగాని లక్షణసారాదుల యస్తిత్వ కర్తృత్వములు నిర్వివాదముగా నిర్ణయింప వలనుపడదు.

కవిత్రయ రచనలలోని ఛందోవిశేషములఁ బర్యాప్తముగాఁ బరిశీలించి యొక ఛందోలక్షణ గ్రంథము రచించుట యాంధ్ర భాషోద్ధారక సంస్థల కర్తవ్యమని మఱొకసారి విన్నవించుచు నీ ప్రసంగము ముగించెద.*

లక్షణ-లక్షణశిరోమణి - పొత్తపి వేంకటరమణకవి (అముద్రితము)

సర్వ - సర్వలక్షణసార సంగ్రహము - కూచిమంచి తిమ్మన

కవిజన - కవిజన సంజీవని - ముద్దరాజు రామన్.

* సంకేతములు:—అప్ప—అప్పకవీయము, రంగ-రంగరాట్ఛందము, చింతా—కవిచింతామణి-తాతింభట్టు (అముద్రితము)



Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press
No. 7, Thambu Chetty Street, Madras. Editor: S. Sambhu Prasad.

శ్రీరస్తు—శ్రీ త్రిపురసుందరీ పరశివాభ్యాం నమః

# శ్రీ మన్మథనామ సంవత్సర పూర్ణశాస్త్రీయ (ఆంధ్రపత్రికా) పంచాంగమ్

## బ్రహ్మశ్రీ శ్రీమత్పిడపర్తి చినపూర్ణార్య సిద్ధాన్తిన స్తృతీయపుత్రేణకృష్ణమూర్తిశాస్త్రిణాప్రణీతం

విఘ్నేశ విధిమార్తండచంద్రేంద్రోపేంద్రవందిత । నమో గణపతే తుభ్యం బ్రహ్మణాం బ్రహ్మణస్పతే ॥

వేదమయ్యాం నాదమయీం బిందుమయీం పరపదోద్యదిందుమయీం ।
మంత్రమయీం తంత్రమయీం ప్రకృతిమయీం నౌమి విశ్వవికృతిమయీం ॥

### గమనిక

ఈ సంవత్సరమున రాజు శుక్రుడు. మంత్రి గురుడు. రసుంచము లు వర్షము. సర్వసస్య సముదాయమగు ౧౬ వీసములలో ౯ వీసములు పంట ఫలించును. శ్రీకృష్ణుడు పశుపాలకుడగుటచే పశువులు తృణ క్షీరాది సమృద్ధిగలవియగును.

జ్యేష్ఠ బ ౩౦ సో. న పాదత్రయ గ్రాసముగల సూర్యగ్రహణము గల్గును. కార్తిక శు ౧౫ మం. న అంగులాధిక గ్రాసముగల చంద్రగ్రహణముగలుగును. తిరుగ కార్తిక బ ౩౦ బు. న అర్ధాధిక గ్రాస సూర్యగ్రహణమున్ను గలుగును.

వైశాఖ శు ౧౨ మం. న యమునా నదీ పుష్కర ప్రవేశము అగును.



గోదావరినదీ పుష్కర ప్రవేశము దుర్ముఖి నామ సంవత్సరమున గలుగును.

సాయన మానముచే నభోమాస (జ్యేష్ఠ) మధికమైనది. నిరయన మానముచే భాద్రపదమాస మధికము.

### మౌఢ్యములు

శ్రావణ శు ౨ గు. ప్ర॥ శ్రావణ బ ౧౩ మం. ప॥ గురు మౌఢ్యము.

శ్రావణ బ ౩ శ. ప్ర॥ నిజ భాద్ర బ ౫ బు. ప॥ శుక్ర మౌఢ్యము.

| | |
|---|---|
| కల్యాద్యబ్దాః | ౫౦౫౬ |
| శాలివాహన శకః | ౧౮౭౭ |
| ఫసలీసన్ | ౧౩౬౪-౫ |
| హిజరీసన్ | ౧౩౭౪-౫ |
| క్రీస్తు సం. | 1955–56 |

శ్రీః శ్రీః శ్రీః

## ఆంధ్రపత్రికా కార్యాలయము, మద్రాసు 1.

## పంచాంగపద్ధతి ప్రశంస

పంచాంగమంతయు గవర్నమెంటు కాలెండరు రిఫార్ము కమిటీవారి సూచన ననుసరించి కాలమానము, గంటలలో నీయబడినది. తిథి, నక్షత్రము, దినమానము ఘటికలలో గూడ చూపబడినవి. గంటలు అర్ధరాత్రినుండి చూపబడినవి. అనగా అర్ధరాత్రి 24-0 గంటలు. అటనుండి 1, 2 గంటలుగ కాలమానము. మధ్యాహ్నము 12 గంటలు దాటినపిమ్మట కాలమానము 1-2-3 మొదలగు గంటలు 13, 14, 15 ఈ రీతిగ చూపబడినవి. దీనింబట్టి 8, 9 ఇట్లు 12 గంటలకు లోపు కాలము మధ్యాహ్నమునకు పూర్వమని గ్రహింపవలెను. 1, 2, 3 ఇత్యాదిగంటలు అర్ధరాత్రి దాటిన పిమ్మట యని గ్రహింపవలెను. అనగా ఉదయగంటలకు లోపుగా నున్నచో అర్ధరాత్రానంతరమని తెలియవలయును. ఇది స్పష్టముగ తెలియుటకై 'రా' అను గుర్తుచే రాత్రియని సూచింపబడెను. ఉదయ గంటలకు దాటియున్నచో ఉదయానంతర ముగ తెలిసికొన వలయును. ఆ రోజు సూర్యోదయమునుండి మరునాటి సూర్యోదయము వరకు నున్నచో (పూర్తి) అని వ్రాయబడుచున్నది.

పంచాంగమున వ్రాసిన ప్రకారము ఆకాశమున గనుపించునట్లు చేయుగణితము దృగ్గణితము. ఆ దృగ్గణిత పద్ధతి చేతనే పంచాంగమంతయు చేయబడినది. సూర్యసిద్ధాంతముచే నగు పూర్వపద్ధతి తిథ్యాదికమున్ను వేరుగ చూపబడినది. ఇది తెలియుటకై (పూర్వపద్ధతి పంచాంగే) అని పైన వ్రాయబడినది. జాతక ముహూర్తాదులు దృగ్గణితము చేతనే రుజువు నిచ్చుచున్నవి. రామానుజ మధ్వ సంప్రదాయములలోని వైష్ణవులకు తిరు నక్షత్రములు పుణ్యదినములు మొదలగునవి పూర్వపద్ధతి పంచాంగమునందే వ్రాయబడినవి. దృగ్గణిత పంచాంగమునందు నిరయన మేషాది (అశ్విన్యాది) వేదాంగ జ్యోతిషాది ప్రామాణ్యముచే చిత్రాసమ్ముఖ స్థితముగ నిశ్చయించి గ్రహింపబడెను. ఈ విషయము భారతదేశమునందు అనేకులగు పంచాంగ కర్తలచే సిద్ధాంతీకరింప బడినది. దృగ్గణిత పద్ధతిలో సాయన మానముచే నగు ఋతుపరిణామమున్ను సూచింపబడినది. వాస్తవముచే ఋతువులు మారినవి. పూర్వకాలమున ఋతువు లెట్లుండెడివో ప్రస్తుతమెట్లు మార్పు చెందినవో ఆ విషయము ఇదివరలో విపులముగ వ్రాయబడెను. ఆ విమర్శనము ననుసరించియే ఋతుపరిణామము సూచింపబడెను.

ప్రస్తుత కాలమున నూతనముగ ఉత్పన్నములగు గ్రహములు నవీనయంత్ర సాహాయ్యముచే గనుగొనబడినవి. అవి 1. యురేనస్, 2. నెప్ట్యూన్, 3. ప్లూటో. యురేనస్సును, వరుణగ్రహమనియు, నెప్ట్యూనును ఇంద్రగ్రహమనియు, ప్లూటోను యమగ్రహమనియును మనవారు వ్యవహరించుచున్నారు. యు. నె. ప్లూ. ఈ అక్షరములచే రాశి చక్రమునందు ఆగ్రహముల రాశి సంచారము సూచింపబడినది.

శ్రీః శ్రీః శ్రీః

## దేశాంతర చక్రము

| పట్టణములు | మేష తులా | వృష కన్యా | మిథున సింహ | కర్కాటక | వృశ్చిక మీన | ధనుః కుంభ | మకర |
|---|---|---|---|---|---|---|---|
| శృంగేరి | ౬౫ | ౮౩ | ౮౯ | ౭౧ | ౫౮ | ౫౧ | ౪౯ |
| మైసూరు | ౫౦ | ౬౦ | ౬౭ | ౮౨ | ౪౦ | ౩౨ | ౨౭ |
| బెంగుళూరు | ౪౨ | ౫౧ | ౫౭ | ౬౧ | ౩౩ | ౨౬ | ౨౩ |
| అనంతపురం | ౪౨ | ౪౮ | ౫౧ | ౫౩ | ౩౮ | ౩౩ | ౩౧ |
| కర్నూలు | ౩౮ | ౪౦ | ౪౨ | ౪౩ | ౩౪ | ౩౨ | ౩౧ |
| నెల్లూరు | ౧౮ | ౨౩ | ౨౮ | ౨౯ | ౧౦ | ౮ | ౫ |
| హైదరాబాదు | ౩౨ | ౩౧ | ౩౧ | ౩౦ | ౩౩ | ౩౩ | ౩౪ |
| తంజావూరు | ౨౮ | ౪౦ | ౫౧ | ౫౪ | ౧౪ | ౪ | ౦ |
| కంచి (కామకోటి) | ౨౦ | ౨౯ | ౩౮ | ౩౯ | ౧౧ | ౩ | ౧ |
| వరంగల్లు | ౨౪ | ౨౩ | ౨౩ | ౨౨ | ౨౫ | ౨౫ | ౨౬ |
| బెజవాడ | ౧౨ | ౧౩ | ౧౪ | ౧౪ | ౧౧ | ౧౦ | ౧౦ |
| చెన్నపురి | ౧౫ | ౨౪ | ౩౦ | ౩౩ | ౬ | ౦ | ౩ |
| కుంభకోణం | ౨౩ | ౩౮ | ౪౮ | ౫౧ | ౯ | ౨ | ౫ |
| విజయనగరం | ౧౬ | ౧౭ | ౨౦ | ౨౨ | ౧౪ | ౧౨ | ౧౦ |
| బరంపురం | ౩౦ | ౩౪ | ౩౭ | ౪౦ | ౨౬ | ౨౨ | ౨౦ |
| రంగూను | ౧౪౫ | ౧౪౫ | ౧౪౪ | ౧౪౪ | ౧౪౫ | ౧౪౬ | ౧౪౬ |

## రాజమండ్రినుండి స్వగ్రామమునకు మార్చుట

రాజమండ్రినుండి ఆయాపట్టణములకు మేషాదిసాయనమాసము లందుగలుగు దేశాంతరవిఘటికలు పైచక్రమునందు గలవు. ఆయా రాశ్యయనప్రవేశము మొదలు ఆయా రాశి సాయనమాసము లగుచుండును. పై దేశాంతరవిఘటికలు సాయనమాసారంభమువంతగును. స్వగ్రామమునకు సమీపమందున్న పట్టణమునకు అభీష్టసాయనమాసమందగు దేశాంతర విఘటికలను పంచాంగతిథ్యాదులందు నల్లని రేఖకు పైనున్న వాటిని తీసి వేయవలెను. క్రిందనున్న వాటిని కలుపవలయును. అట్లుచేయగా స్వగ్రామములకు తిథ్యాదు లగుచున్నవి.

## మేషాది నిరయనరాశి ప్రమాణములు

| | | | | | |
|---|---|---|---|---|---|
| మేషము | ౪-౨౨ | గం. 1-45 | తుల | ౫-౨౪ | గం. 2 10 |
| వృషభము | ౫- ౧ | గం. 2. 0 | వృశ్చికము | ౫ ౩౫ | గం. 2 14 |
| మిథునము | ౫ ౩౧ | గం. 2 12 | ధనుస్సు | ౫ ౩౭ | గం. 2 7 |
| కర్కాటకము | ౫-౩౧ | గం. 2 13 | మకరము | ౪ ౩౯ | గం. 1 52 |
| సింహము | ౫ ౧౮ | గం. 2- 7 | కుంభము | ౪ ౭ | గం. 1·8· |
| కన్య | ౫-౧౩ | గం. 2- 5 | మీనము | ౪- ౧ | గం. 1 36 |

## మేషాది సాయన రాశి ప్రమాణములు
(నిరక్ష దేశమునకు)

| | | | |
|---|---|---|---|
| మీన మేషములు | ౪ ౩౯ | కర్కాట ధనుస్సులు | ౫ ౨౨ |
| వృషభ కుంభములు | ౪-౫౯ | సింహ వృశ్చికములు | ౪ ౫౯ |
| మిథున మకరములు | ౫-౨౨ | కన్యా తులలు | ౪-౩౯ |

ఇవి దశమలగ్నానయనమున కావశ్యకములు.

| | | |
|---|---|---|
| అయనాంశములు | భా ౨౩ లి ౧౩ | విలి ౦ |
| అయనాంశ గతి | | విలి ౫౦. ౨ |

## సంవత్సర ఫలము

| మి | వృ | మే | మీ | మి | వృ | మే | మీ |
|---|---|---|---|---|---|---|---|
| గు. కే | ల | శు | ర. చం | గు. కే | శు | ర | బు |
| యు | జగల్లగ్నము | | బు | యు | వర్షలగ్నము | | ల. కు |
| ప్లూ | | | శు | ప్లూ | | | |
| | శ నె | | రా | | శ నె | | చం. రా |

జగల్లగ్నాధిపతికిని వర్ష లగ్నాధిపతికిని భాగ్యస్థితి. దేశ సౌభాగ్యమును కూర్చును. కాని జగలగ్నాష్టమమున రాహువు లగ్నాధిపతికి యురేనస్ యొక్క దృష్టి. వర్షలగ్నాధిపతికి నెఫ్ట్యూను సంబంధము. వీటిచే ప్రపంచమునకు విశ్రాంతి లేదు. వర్ష లగ్న నవమస్థానమున నీచ బుధుడు. లాభమున రాహుస్థితి. కుజ శని దృష్టి. ద్వాదశమున రవి. జగల్లగ్నాధిపతికి రాజ్యస్థితి మాత్రము శుభము. షష్ఠమందున్న గురునకు కేతు సంబంధము. ఈ కారణములచే ప్రపంచమున వ్యాపారము హెచ్చును. ధనార్జనము క్రౌర్య నైద్యములతో కూడియుండును. గాని జగలగ్నమున భాగ్య రాజ్యాధిపతి శనికి షష్ఠ స్థితి ఉన్నది. వర్షలగ్న రాజ్యాధిపతికి రాజ్యవీక్షణము. వీటచే రాజకీయ వ్యాపారములు విరోధముతో కూడియున్నను తీవ్రముగ నుండి అనుకూలములగును. జగల్లగ్న ధర్మ కర్మ స్థానములు శుభ సంబంధము గలవి రైనను వర్షలగ్నమును బట్టి పాపదృష్టి సంబంధములు గలవి యగుటచే వైదిక ధర్మము సత్కార్యములను ఒక్కొకచో వృద్ధియగుచున్నను వాటికి విశేషముగ హాని గలుగుచుండును. జగల్లగ్నమును బట్టి భాగ్యరాజ్యాధిపతి యగు శనిః షష్ఠస్థితి యగుటచే రాజ్య సంబంధమై శత్రుబాధ లధికమైనను వాహనాధిపతికి లాభమందుండుట వర్షలగ్నమును బట్టి రాజ్యాధిపతి రాజ్యమును చూచుట భాగ్యాధిపతికి లాభస్థితి వీటిచే యోగ క్షేమములు (ఇతర రాజ్యములు స్వరాష్ట్రములో చేరుట యోగము. వాటిని చక్కగ పాలించుట క్షేమము) అనుకూలముగ నుండును. సంవత్సర సముదాయమునందు ధాన్యములు గోధుమలు బంగారము లోహములు రత్నములు అనుకూలమైన ధర గలిగియుండునట్లు తోచెడివి. ఆయా మాసములందైన గ్రహస్థితిని బట్టి సర్వ పదార్థములకును ధరలు వేరు వేరుగ ముందు వ్రాయబడి యున్నవి. జ్యేష్ఠమాసము మొదలొక్కని ఈ సంవత్సరము ఒక్కొకచో ఎండలు కాయుచున్నను, ఒక్కొకచో మంచి వర్షములు గలుగుచుండును. గాని శ్రావణమాస ప్రారంభమునుండి ఆశ్వయుజ మాసాంతమువరకు కాలసర్పయోగము పిమ్మట శని రాహు యోగము గలుగుటచే సస్యములకు వ్యాధులు గలుగుచుండును. ప్రతి మాసమందును వర్షవిచారమున్ను వేరుగ ముందు చేయబడినది. కార్తికమున పూర్ణిమకు చంద్ర గ్రహణము, అమావాస్యకు సూర్య గ్రహణమున్ను, గలుగుటచే యుద్ధవాయువులు విశేషముగ వీచును. దుర్నీతి హెచ్చును.

సర్వేషాం సమస్త శుభాని భవన్తు శ్రీః శ్రీః శ్రీః

## సూర్యగ్రహణము

తా 20 జూన్ 1955 సం.

మన్మథనామ సం॥ జ్యేష్ఠ బ. అమా సో. రే సూర్యగ్రహణం. కేతు గ్రస్తః. కృష్ణ వర్ణః పాదత్రియ గ్రాసః ½ సూర్యోదయాదితః

స్పర్శ కాలః ౪-౨౦ గం 7 16
మధ్య కాలః ౬-౫౯ గం 8-19
శుద్ధ మోక్ష కాలః ౧౦-౭ గం 9-35



అద్యంత పుణ్యకాలః ౫ ౪౭ గం 2-19 దక్షిణగోలః. అపసవ్యగ్రహణం. నైరృతి దిక్స్పర్శః ప్రాగ్దిశి మోక్షః. (ఈగ్రహణము బర్మాకును సిలోనుకును సంపూర్ణ (ఖచ్ఛన్న)ముగ నుండును.

మద్రాసుకు:—స్పర్శ కాలః 8-20 మధ్య కాలః 9-25 మోక్ష కాలః 10 40 ఆద్యంత పుణ్యకాలః 2 20 గ్రాసః6/7

నిత్య భోజన ప్రత్యబ్ది కాదికము:—మోక్షానంతరము స్నానము చేసి నిత్యభోజన ప్రత్యబ్ది కాదికము జరిగించవలెను.

## చంద్రగ్రహణము

ది 29 నవంబరు 1955 సం

మన్మథ సం॥ కార్తిక శుక్ల పూర్ణిమా మం. కే చంద్రగ్రహణం. కేతుగ్రస్తః ధూమ్రవర్ణః అంగుళాధిక 1/9 గ్రాసః సూర్యాస్తాది.

స్పర్శ కాలః ౧౧ ౭ గం 21-53
మధ్య కాలః ౧౨-౪౦ గం 22 30
శుద్ధ మోక్ష కాలః ౧౪-౧౩ గం 23- 7



ఆద్యంత పుణ్యకాలః ౩-౫ గం 1 14 ఉత్తరగోలః. అపసవ్య గ్రహణం దక్షిణాగ్నేయ మధ్యే స్పర్శః. దక్షిణ నిర్‌ృతి మధ్యే మోక్షః.

నిత్య భోజన ప్రత్యబ్దికాదికము:—ఈ గ్రహణ దినమున గలుగు ప్రత్యబ్ది కాదికమున్ను నిత్య భోజనమున్ను పగలు 12 గంటలకు లోపు కాలమున నాచరింపవలెను.

## సూర్యగ్రహణము

ది 14 డిశంబరు 1955 సం.

మన్మథ సంవత్సర కార్తి బ. అమా బు. కే సూర్యగ్రహణం. రాహుగ్రస్తః అర్ధాధిక ¾ గ్రాసః. కృష్ణ వర్ణః సూర్యోదయాదితః

స్పర్శ కాలః ౧౧ ౩౯ గం 11-5
మధ్య కాలః ౧౬ ౫౫ గం 13-11
శుద్ధ మోక్ష కాలః ౨౧-౪౦ గం 15-5



ఆద్యంత పుణ్యకాలః ౧౦ ౧ గం 4 0 దక్షిణగోలః అపసవ్య గ్రహణం పశ్చిమనైరృతి మధ్యే స్పర్శః. ప్రాగాగ్నేయ మధ్యే మోక్షః.

మద్రాసుకు:—స్పర్శ కాలః 12-4 మధ్య కాలః 14-1? శుద్ధ మోక్ష కాలః 16-14 గ్రాసః ¾.

నిత్య భోజన ప్రత్యబ్ది కాదికము:—ఇందును శుద్ధ మోక్షానంతరమే నిత్య భోజనము, ప్రత్యబ్ది కాదికము జరిగించవలెను.

## ధర్మశాస్త్ర సందేహ విషయములు.

## సింహ గురుదోషము.

ఈ సంవత్సరమున నిజ భాద్రపద శు ౧౫ శ. ప్ర॥ ఫాల్గున శు ౨ బు. ప॥ సింహరాశిలో మఘ యందు గురుడు సంచరించును. కావున ఈ కాలమున శుభకర్మలు చేయరాదు.

## ఉపాకర్మ.

శ్రావణ భాద్రపదములలో గురు శుక్ర మౌఢ్యములు గలుగుటచే నాషాఢ మాసముననే ఉపాకర్మలు నూతనోపనయనమైన వారలకు చేయుదురు. ఆషాఢ శు౭సో. న సామవేదులకు, శు ౧౪ సో. న వాజసనేయులకు. శు ౧౫ మం. న తైత్తిరీయులకు, బ ౨ శు. న ఋగ్వేదులకును నవోపనీతుల కుపాకర్మలు అగును.

## సిద్ధి వినాయక చతుర్థి

పూర్వపద్ధతి పంచాంగమున భాద్ర శు 3 సో ౧౪ ౭ దిన 30-౧౬
౪ మం ౧౬-౪౪ దిన 30-౧౩

దృగ్గణిత పం. భాద్ర శు 3 సో ౧౪-౪౨ దిన 30-౨౨
౪ మం ౧౮ ౫౫ దిన 30-౧౯

రెండు పద్ధతుల పంచాంగములందును చతుర్థి మధ్యాహ్న కాలమున రెండు రోజులందును గలదు. అందు పరదినమున అధికముగ గలదు. ఐనను సిద్ధి వినాయక చతుర్థికి తృతీయతో గలియుట శ్రేష్ఠము గావున సోమవారమే సిద్ధి వినాయక చతుర్థీ వ్రత మాచరింప దగినది.

## విజయదశమి.

దృగ్గణిత పంచాంగమున సందేహము లేదు.

పూర్వపద్ధతిలో అశ్వ శు ౯ మం. ౨౧-౧౫ శ్రవ ౧౦ ౩౬ దిన ౨౭-౪౭ శు ౧౦ బు ౨౩-౨౦ ధని ౧౪-౧౭ దిన ౨౭ ౪౬.

విజయదశమి అపరాహ్ణ వ్యాప్తినిబట్టి, అందును ఏకాదశి ముహూర్తవ్యాప్తిని బట్టియు నిర్ణయింప దగినది. ఆ ఏకాదశి ముహూర్తములో మంగళవారమున స్వల్పముగ నున్నను బుధవారమున పూర్తిగ నుండుటచే ఈనాడే విజయదశమి అగును.

## దీపావళి

ఈ ఉత్సవము అశ్వ బ. చతుర్దశి మొదలు 3 రోజులు చేయదగినది. కొందరు త్రయోదశి మొదలు 5 రోజులు చేయవలయునని చెప్పిరి. అమావాస్య ముఖ్యదినము ప్రధానమైనది. కొందరు దీనిని నరకాసుర సంబంధమైనదిగ తలచుచున్నారు. అట్లు ప్రమాణము లేదు. నరక చతుర్దశి యను పేరునుబట్టి అట్లు తలంతురు. నరక నివృత్తికై ఇందు అభ్యంగాదికము చేయబడుచుండుటచే నరక చతుర్దశియని గలదు. ఈ అమావాస్యనాడు బలిచక్రవర్తిని వామనుడై యాచించి శ్రీహరి స్వర్గరాజ్యము నింద్రునకిచ్చెను. వారి రాజ్యమునందు వలె ప్రజలుత్సాహముతో చేయు యథేష్ట చేష్టయను ఉత్సవమునకు కౌముద్యుత్సవమని పేరు. ఇదియే దీపావళి యని చెప్పబడినది. ఈ విషయము భవిష్య పురాణమందున్నదని హేమాద్రి (చతుర్వర్గ చింతామణి) యను గ్రంథములో గలదు. ఈ కౌముద్యుత్సవమునకు అపరాహ్ణ సంబంధముచే నిర్ణయించుట శాస్త్రమందు గలదు. గావున అమా సో. న దీపావళి.

## శ్రీ మన్మథనామసంవత్సర పఞ్చాఙ్గ పీఠికా.

అచింత్యావ్యక్త రూపాయ నిర్గుణాయ గుణాత్మనే। సమస్త జగదాధార మూర్తయే బ్రహ్మణేనమః ॥౧॥ లంబోదరాంఘ్రిద్వయమంబుజశ్రీ సర్వస్వహోగ్యస్వహమస్వయామః॥ యదర్చయా బ్రహ్మముఖామరేశా నిరంతరాయం సఫలీ కృతార్థాః ॥౨॥ ప్రావృట్స్ఫురన్మేఘనిభా భుజంగశయ్యావిభూషా విహగేంద్రవాహా। గోపాల మల్లేశ్వర దేవదేవౌ భక్తప్రియౌ దత్త హృదర్ధదేహౌ ॥3॥ వేదమయీం నాదమయీం బిందుమయీం పరపదోద్య దిందుమయీం। మంత్రమయీం తంత్రమయీం ప్రకృతిమయీం నౌమి విశ్వవికృతిమయీం ॥౪॥

గురుస్తుతిః॥ శ్రీ నోరి వంశాబ్ధి సోమం సూర్యనారాయణాభిధం। జ్యోతి శ్శాస్త్రి కులగురుం ధ్యాయామి మనసానిశం।

॥౫॥ యదను గ్రహాతః ప్రాప్తం విజ్ఞానం సర్వశాస్త్రజం। తంసాహిత్య గురుం వందే దర్భా బైరాగి శాస్త్రిణం ॥౬॥ చిలుకూరి ఖ్యాతి వంశమణిం కొండయ్య శాస్త్రిణం। శిష్ట శాస్త్రేతి విఖ్యాతం వందే మచ్ఛాత్ర దేశికం॥ ॥౭॥ మాతులం న్యాయ సాహిత్యాచార్యం మన్న్యాయ దేశికం। భజామ్యహం వారణాశి వేంకటేశ్వర శాస్త్రిణం ॥౮॥ యస్య బోధలవం ప్రాప్య మీమాంసా శాస్త్ర సాగరా। తీర్ణామయా గురుం వందే భూమానందయతీశ్వరం ॥౯॥ మహామహోపాధ్యాయం శ్రీ రఘోపాఖ్య మురలీధరం। తంసౌమ్య స్మద్గురుం జ్యోతిషాబ్ధి పారంగతో యతః ॥౧౦॥

స్వీయ వంశక్రమః॥ శ్రీ కౌండిన్యస గోత్రే పిడపర్త్యాఖ్యాన్వయే ప్రసిద్ధతమే। త్రిస్కంధ శాస్త్ర కృతినోభవ న్నిశిశ్వబ్ధ హోశ్శాంత్ ॥౧౧॥ చలమాఖ్య వేంకటచలాఖ్యాఖ్య స్త్రోథః ద్విబుధః। యోలు ప్తమాసవిషయక వాదే నాగణయదపిద విశ్వపతిం ॥౧౨॥ తస్యసుత స్తత్సదృశశ్శేషాచల దైవవిత్ప్రవరః। జజ్ఞాతే తస్యసుతా పూర్ణా విద్యాసుపరిపూర్ణా ॥౧౩॥ తయోర్ద్వితీయోఽద్వితీయ ప్రతిభా వాన్సుధో త్తమః। శ్రీ పూర్ణార్యః పుష్కరాది సంపత్ప్రోజ్జ్వలద్యశాః ॥౧౪॥ తదను గ్రహో త్త విద్యాః పంచసుతా స్తస్య శంభుభక్తి సమాః శ్రీ కృష్ణమూర్తి శాస్త్రి హ్వయ స్తృతీ యోహమేషుమయా ॥౧౫॥ గురువర కరుణావశత స్సిద్ధాన్త కృత్య నిఖిల సంపత్సు। స్వమతం, తథాద్య క్రియతే పంచాంగం ధర్మకర్మార్థం ॥౧౬॥

## సంవత్సరాది కృత్యం

అభ్యాదామిత్ర సంయుక్తో మంగళస్నాన పూర్వకం। అలంకృతో గణాన్యత్తం వాణీం దైవవిదం గ్రహాన్ ॥౧౭॥ సమాన్వి ప్రాంశ్చ సంపూజ్యముదితో బ్రహ్మ జన్మతః। సంవత్సర ఫలం శ్రుత్వా సుకృతా వాంఫలంలభేత్ ॥౧౮॥ యద్వర్షా దౌనింబసుమం శర్కరామ్ల ఘృతైర్యుతం। భక్షితం పూర్వ యామే స్యాత్తద్వర్షం సౌఖ్యదాయకం ॥౧౯॥

## బ్రహ్మయుః ప్రమాణాదికం.

బ్రహ్మణ సౌరమానేన త్రుటికాల ప్రమాణం మా ౫ ది ౨౭ ఘ ౪౬ విఘ ౪౦. లవకాల ప్ర. సం ౪౯ మా ౪ ది ౧౭ ఘ ౪౬ విఘ ౪౦. నిమేష కాల ప్ర. సం. ౧౪౮౧ మా ౫ ది ౨౩ ఘ ౨౦ గుర్వక్షరోచ్చారణకాల ప్ర. సం. ౪౦ సహస్రాణి. ప్రాణకాల ప్ర॥ సం ౪ లక్షాః. విఘటీ ప్ర. సం. ౨౪ ల. ఘటీ ప్ర. సం. ౧౪ కో ౪౦ ల. దిన ప్ర. సం. ౪౩౨ కోటయః. అనేన బ్రహ్మయుః ప్రమాణసౌరాబ్దాః ౩,౧౧,౧౪,౦౦౦ కోటయః. వర్తమానస్యాస్య బ్రహ్మణః పరాఖ్యస్యాయుషోర్ధం గతం. ద్వితీయ పరార్ధే ప్రథమవర్షే ప్రథమమాసే గత ఘట్యాదయః. ఘ ౧౩ విఘ ౪౨ ప్రా(౦) గుర్వ ౩ నిమే ౧౯ లవాః ౧౮ త్రుటి ౩౮సం ప్రత్యేకోనచత్వారింశత్తిమే త్రుటి కాలే గత సౌరమానాదయః. మా౨ది ౧౧ ఘ ౬ విఘ ౪౦ బ్రహ్మణస్సౌరమానేన వయోగత వత్సరాః ౧౫౫౫౨౧౯౭ కో ౨౯ ల ౪౯ సహ ౫౬ సం. ఇదానీంతన శ్వేతవరాహకల్పే స్వాయంభువాద్యాష్టమ్మనవోగతాః। సప్తమే వైవస్వత మన్వంతరేప్తవింశతి మహాయుగాగతాః। సప్తవింద్ర మనూనామపి స్వమానేనాయుర్వర్త శతమేవ. తచ్చైక సప్తతి మహాయుగమితం। తత్ప్రమాణ సౌరాబ్దాః ౩౦ కో ౬౭ ల ౨౦ సం॥ తత్సంవత్సర ప్ర॥ ౨ ల ౫౫ సహ ౬౦౦ సం॥ అహోరాత్ర ప్ర॥ ౮౫౨౦ సం॥ అహః ప్ర॥ ౪౨౬౦ ఘటీ ప్ర. సం. ౧౪౨ వర్తమాన స్యాస్య వైవస్వతమనోర్వ్యయో గతవత్సరాః ౧౨ కో ౫ ల ౩౩ సహ. ౫౬ సం॥ ఏష్యాబ్దాః ౧౮ కో ౬౧ ల ౮౬ సహ

౯౪౪ సం శ్రీ ముజ్జగద్గురు శ్రీమచ్ఛంకర భగవత్పాద పూజ్యాచార్యాబ్దాః ౨౦౨౭ శ్రీ శాలివాహన శకాబ్దాః ౧౮౭౭ ప్రభవాది గతాబ్దాః ౨౮ ఏష్యాబ్దాః ౩౨

## వ్యవహారమాన నిరూపణం

అథాస్మిన్దేశే లోకవ్యవహారార్థం చాంద్రమానాబ్దో గ్రాహ్యః. వింధ్యస్యోత్తరదేశే బార్హస్పత్యమానాబ్దో గ్రాహ్యః। అయమేవ ఫలప్రదర్శనార్థం మానవామ్నా గ్రాహ్యః। చాంద్రమానవశాదయం మన్మథనామసంవత్సరః బార్హస్పత్యమాన వశాదయం కీలక నామ సంవత్సరః। అయమేవ మాఘాబ్ద ఇత్యుచ్యతే। ప్రభవాది షష్టి సంవత్సరేషు ద్వాదశాయుగాని. తత్ర అహిర్బుధ్న్య దేవతాకం షష్ఠయుగం। తత్రచ ప్రజాపతి దేవతాకానువత్సరః। అస్మిన్ధాన్య దానం మహాఫలం అనువత్సర ఫలం॥ పశ్చాజ్జలం ముంచతి యచ్చ పూర్వం॥ ఇతి మన్మథస్సముఫలః ఇతి॥ బార్హస్పత్యమానేన పరివత్సరాఖ్య సంవత్సర ఫలం॥ ప్రముఖే ద్వితీయే॥ ఇతి॥ శుభప్రదా కీలకః సౌమ్యసంజ్ఞా॥ ఇతి॥

తా॥ ఈ దేశమున చాంద్రమానముచే మన్మథనామ సంవత్సరము. దీనికి అనువత్సరమనియు పేరు. ఇందు ధాన్యదానము మహాఫలము. అనువత్సరమున వర్షకాలము తుదను మంచివర్షము గలుగునని శాస్త్రము. బార్హస్పత్యమానముచే కీలక సంవత్సరము. శుభప్రదమైనది. మాఘాబ్దమనియును పేరు. పరివత్సరమనియును నామాంతరము. దీనిచే నిందు మొదట మంచి వర్షములు గల్గును.

## మన్మథ సంవత్సర ఫలము

మన్మథాబ్దేఖిలాలోకా స్సుఖాను భవలోలుపాః॥
శాలీక్షు యవ గోధూమైర్న్న యనాభీష్టవాధరా॥

తా॥ మన్మథసంవత్సరమున ప్రజలు సుఖాసక్తులయ్యెదరు సస్యములచేతను చెఱకు తోటలచేతను భూమి దృష్టి ప్రియముగ నుండును.

బార్హస్పత్య మానాబ్దఫలం. కీలకాబ్దే తీవ్రతిభీతిః ప్రజాక్షోభో నృపాహవైః। ప్రమరాః పిత్తరోగాస్సర్వత్రాధ్య వృష్టి రహార్ఘ్యయం॥ మాఘాబ్దఫలం॥ క్షేమారోగ్యం సుభిక్షం చ వర్షణం శివమేవచ। పిత్రుపూజాః ప్రవర్తంతే మాఘే రాజ్ఞాంచ సంధయః॥

తా॥ బార్హస్పత్య మానముచే కీలక గావున నిందు అతివృష్టి అనావృష్టి మొదలగు ఈతి బాధలు, యుద్ధములచే ప్రజలకు సంక్షోభము గల్గును పిత్తరోగము లధికములగును. మధ్యవృష్టి సర్పభయము (పాముంలే భయమున్నా) గలుగును. మాఘాబ్దమగుటచే క్షేమము (పరిపాలన సౌకర్యము) ఆరోగ్యము సుభిక్షము సువృష్టి పిత్రుపూజా శుభములు పిత్రుభక్తి గలుగును. ప్రభువులకు సంధి ప్రయత్నములు కల్గించును.

## రాజాది నిర్ణయము

| | | |
|---|---|---|
| రాజాశుక్రః | గణకశ్చంద్రః | వరాణామధిపతిర్బుధః |
| మంత్రీగురుః | గ్రామపాలకో బుధః | గ్రామనాయక శ్శనిః |
| సేనాధిపతిర్బుధః | దైవజ్ఞో బుధః | వస్త్రాధిపతి శ్చంద్రః |
| సస్యాధీశశ్శనిః | రాష్ట్రాధిపతి శ్శుక్రః | రత్నాధిపతిర్బుధః |
| ధాన్యాధీశశ్శుక్రః | సర్వ దోషోద్యోగ పతిర్గురుః | వృక్షాణామధిపతి శ్శుక్రః |
| అర్ఘాధిపతి ర్బుధః | అశ్వాధిపతిర్గురుః | జంగమాధిపతిశ్శనిః |
| మేఘాధిపతి ర్బుధః | గజాధిపతి స్సూర్యః | సర్పాధిపతి శ్చంద్రః |
| రసాధిపతిశ్చంద్రః | పశూనామధిపతిర్బుధః | మృగాణామధిపతి ర్బుధః |
| నీరసాధిపతి శ్శనిః | దేవాధిపతిశ్శనిః | శుభాధిపతి శ్శుక్రః |
| పురోహిత స్సూర్యః | | స్త్రీణామధిపతిర్బుధః |
| పరీక్షక శ్శనిః | | |

శుక్రుడు:—రాజును ధాన్యాధిపతియు నయ్యెను. మరియు రాష్ట్రాధిపతియు వృక్షాధిపతియు. శుభాధిపతియు నయ్యెను.

గురుడు:—మంత్రి యయ్యెను. మరియు సర్వ జ్యోతిర్యోగాధిపతియు, అశ్వాధిపతియు, నయ్యెను.

బుధుడు:—సేనాధిపతియు,అర్ఘాధిపతియు, మేఘాధిపతియు నయ్యెను. మరియు గ్రామపాలకుడును, దైవజ్ఞుడును, పశువుల కధిపతియు, నరాధిపతియు, రత్నాధిపతియు, మృగాధిపతియు, స్త్రీల కధిపతియు నయ్యెను.

శని:—సస్యాధిపతియు నీరసాధిపతియు నయ్యెను. మరియు పరీక్షకుడు, దేవాధిపతియు, గ్రామనాయకుడును, జంగమాధిపతియు, నయ్యెను.

చంద్రుడు:—రసాధిపతి యయ్యెను. మరియు గణకుడును, వస్త్రాధిపతియు, సర్పాధిపతియు నయ్యెను.

సూర్యుడు:—పురోహితుడును, గజాధిపతియు, నయ్యెను. కుజున కే యాధిపత్యమున్ను లేదు. (శుభము)

## రాజు శుక్రుడు, ఫలము

సమృద్ధసస్యా వసుధాతివృష్టి ర్గావోహి సంపూర్ణ పయః ప్రదాస్స్యుః। స్త్రియః ప్రియాణాంజనయు న్తితోషం ప్రియోపచారైర్భృగు జేబ్దనాథే॥ తా॥ సస్య సమృద్ధి, సువృష్టి, పశువులకు క్షీర సమృద్ధి, దంపతులకు పరస్పర ప్రేమాభి వృద్ధియు గలుగును.

## మంత్రి గురుడు, ఫలము

జీవేత్య మాత్యే బహుధాన్య సంపదః ప్రభూత వర్షాశ్చ భవన్తి మేఘాః। ఫలంతి వృక్షా బహు సస్యవృద్ధి ర్ధరా ప్రజా గోకుల సంకులాస్యాత్ ॥

తా॥ వర్షములు బాగుగనుండును. ధాన్యములు ఇతర సస్యములు సమృద్ధి యగును. వృక్షజాతులన్నియు ఫలించును. ప్రజావృద్ధి పశువృద్ధియు నగును.

## సేనాధిపతి బుధుడు, ఫలము.

వాతా హతా వారిధరాః కదాచిద్వర్ష న్తి సస్యాని ఫలాన్వితాని। లోకాస్స దాభీతిత కామచారా సైన్యాధిప త్యేభలు చంద్రజస్య॥

తా॥ బుధ సైన్యాధిపత్యముచే మేఘములు గాలిచే కొట్టబడి ఒక్కొక్కప్పుడు వర్షించును. సస్యములు ఫలించును. ప్రజల స్వేచ్ఛా సంచారమునకు ప్రతిబంధము గలుగును.

## సస్యాధిపతి శని, ఫలము.

మధ్యము సముపస్యంక్షితి తిల మినన తనయే సస్య పేతు రాజ భయం। కోద్రవకుళిత్థ చణకై ర్మాషైర్ముద్గైశ్చ పరిపూర్ణం ॥

తా ॥ శని సస్యాధిపతి యగుటచే ప్రజలకు ప్రభుత్వము వలన భయము గలుగును, సస్యములు మధ్యమముగ నుండును. కొర్రలు ఉలవలు సెనగలు మినుములు పెసలు సమృద్ధిగ నుండును.

## ధాన్యాధిపతి శుక్రుడు, ఫలము.

అతి వృష్టిస్సుభిక్షంచ ఫలితాస్సస్య జాతయః।
మానవా నీరుజస్సర్వే శుక్రే ధాన్యాధిపే సతి॥

తా॥ శుక్రుడు ధాన్యాధిపతి యగుటచే అతివృష్టి, సుభిక్షము, సస్యజాతులు ఫలించును. మానవు లారోగ్యముతో నుందురు.

## అర్ఘాధిపతి బుధుడు, ఫలము.

అర్ఘాధినాథే రజనీ కరాత్మజే వృష్ట్యర్ఘ సస్యాని బహూని చస్స్యుః। కౌమార పాషండ జనేంద్రజాలికాః ప్రభూత తోషాశ్చ తథాపరే జనాః॥

తా॥ బుధుడు అర్ఘాధిపతి యగుటచే వర్షములు సస్యములు సమృద్ధము లగును. ధర లనుకూలములగును. వేదనిందకులును మాయావులు యాచకులును సంతోషముతో నుందురు. ఇతరులు సంతోష హీనులయ్యెదరు.

## మేఘాధిపతి బుధుడు, ఫలము.

గర్జితా శని పాషాణ వాతయుక్తాః పయోధరాః।
మధ్యదేశే మహద్వర్షం బుధే మేఘాధిపే సతి॥

తా॥ మేఘములకు ఉరుములు పిడుగులు వడగండ్లు గాలి ఇవి హెచ్చుగనుండును. వానలు అల్పము. మధ్యదేశమున మంచి వర్షము గల్గును.

## రసాధిపతి చంద్రుడు, ఫలము.

రసస్వామిని సోమేతు రసాశ్చ ఫలితా స్తదా।
ఆనందదో రాజవర్గో వృష్టిరత్యధికా భవేత్ ॥

తా॥ ప్రభువులు చక్కగ పాలించెదరు. మంచి వర్షములు గలుగును. రసవస్తువులు సమృద్ధము లగును.

## నీరసాధిపతి శని. ఫలము.

స్వర్ణమణి రత్న ముక్తిక చందన కర్పూర రజతవాళ స్స్యాత్ ।
రవి తనయే నీరసపే లోహత్రపుతైల వృద్ధిశ్చ ॥

తా॥ వెండి, బంగారము, రత్నములు, ముత్యములు చందనము, హారతికర్పూరము మొదలగు నీరస వస్తువులు దుర్లభములగును. ఇనుము ఇత్తడి తైలములు వృద్ధి యగును.

## పురోహితాద్యధిపతి ఫలము.

క్రూర గ్రహఫలం క్రూరం శుభ గ్రహఫలం శుభం।
పురోహితాది సర్వేషాం భవేదీశ సముద్భవమ్ ॥

తా॥ నవనాయకులకంటె భిన్నులగు పురోహితాదులు క్రూర గ్రహములగుచో చెడ్డ ఫలము. శుభగ్రహములగుచో మంచి ఫలము. (ర. కు. శ. పాపయుత బుధుడు క్షీణచంద్రుడును క్రూరులు)

## మేఘాది నిర్ణయము ఫలము.

ద్రోణమను మేఘము—ఎల్లపుడును వర్షములు. తూర్పున మేఘోత్పత్తి। చతుర్మేఘ పక్షమున ఆవర్తమను మేఘము—పడమటి వానలు। ఉద్యోహమను వాయువు—సువృష్టి। విద్యుత్తు అను మెఱపు—మధ్యవృష్టి। సౌమ్యమను ఉరుము—అతి వృష్టి। ఉదధియను సముద్రము—సస్యవృద్ధి। కులికుడను నాగేంద్రుడు భూమిని వహించును— సర్వ సస్యములకును హాని।

జ్యేష్ఠ బ. చతుర్దశి ఆ. వ (19-6-1955 సం) సావన సంవత్సరారంభము.

వర్షాధిపతౌ భానావాతంకవృహాగ్ని శస్త్రభీతి స్స్యాత్ ।
వృష్టి స్స్వల్పతరా మధ్యానిభవన్తి సస్య జాతాని ॥

తా॥ రవి సావన వర్షాధిపతి యగుటచే రోగభయము అగ్ని భయము యుద్ధభయము ప్రభుత్వము వలన భయము గలుగును. వర్షములు తక్కువ సస్యములు మధ్యమముగ నుండును.

## పశుపాలకాది నిర్ణయము, ఫలము.

పశుపాలకుడును గోష్ఠ ప్రాపకుడును శ్రీ కృష్ణుడు. గోష్ఠ బహిష్కర్త బలరాముడు. ఫలము. శ్రీ కృష్ణాధిపత్యముచే సుభిక్షము, పశువృద్ధి, సస్యవృద్ధి, పశువులకు క్షీర సమృద్ధియు గలుగును. బలరామాధిపత్యముచే వర్షములు సస్యములు బాగుగ నుండును. గాని మధ్య దేశమున మంచి వానలు గలుగును.

### వర్ష పరిమాణము.

నాలుగు ఆఢక (కుంచ) ములు వర్షము—మధ్యవృష్టి "అష్టా భాగా స్సముద్రేషు పర్వతేషు తథా దశ । త్రిభాగా, భువి వర్షన్త్యేవం వర్షతి చ త్రిధా॥" సముద్రములం దెనిమిది భాగములు, పర్వతములందు తొమ్మిది భాగములు, భూమియందు మూడు భాగములు ఇట్లు వర్షించును.

ఆఢక ప్రమాణము:—షష్టియోజన విస్తీర్ణం శత యోజన మున్నతం ఆఢకస్య ప్రమాణంతు దేవమానేన గణ్యతే॥

ఆఢక స్థితి:—సంవత్సరాది మొ॥ ఆశ్వ బ ౧౩ శ. ప॥ గోప వృద్ధుని హస్తమందును, అటనుండి సంవత్సరము తుదివరకు గోపబాలుని హస్తమందును ఆఢక ముండును. గోపుని హస్తముచో సుభిక్షము ఆరోగ్యము సంపత్తు గలుగును. బాల్యవయస్సుచో వర్షములు తక్కువయగును. వృద్ధి వయస్సుచో సుభిక్షముగలుగును.

### వర్ష ధాన్యాది ప్రమాణములు (వింశోపకములు)

వర్షం ౧౧ ధాన్యం ౧౩ శీతం ౧౧ తృణం ౧౯ ఉష్ణం ౧౩ మారుతః ౪ ప్రజావృ ౧౫ నా ౧౫ రాజవిగ్రహం ౧౧. వ్యాధయః ౧౧ ఉపశమనం ౧౫ ఆచారః ౯ అనాచారః ౧౫ మరణాని ౮౧ జన్మాని ౧౩ దేశోపద్రవః ౧౧ దేశస్వాస్థ్యం ౧౯ చోరభయం ౫ నా ౫ అగ్నిభయం ౫ నా ౪ మృగోపద్రవః ౧౩ నా ౪ కీటకభయం ౪ నా ౧౫ శలభవృ ౩ నా ౧౧ మశకవృ ౪ నా ౪ మత్కుణవృ ౧౧ నా ౩ వృశ్చికవృ ౧౧ నా ౧౧ వ్యాఘ్రవృ ౩ నా ౪ సస్యవృ ౭ నా ౯ శుకవృ ౪ నా ౪ పికవృ ౭ నా ౫ కుక్కుటవృ ౭ నా ౭ ఖగవృ ౫ నా ౮ గోవృ ౬ నా ౨ మహిషవృ ౮ నా ౬ మృగవృ ౩ నా ౩ ఛాగవృ ౫ నా ౫ అశ్వవృ ౬ నా ౫ స్వేదజవృ ౧౧ నా ౧౯ వ్రీహివృ ౧౭ శాలివృ ౭ కులుత్థవృ ౧౨ తిలవృ ౧౮ మాషవృ ౬ ముద్గవృ ౧౮ సర్షపవృ ౧౦ చణకవృ ౧౬ ఆఢకవృ ౧౦ గోధూమవృ ౧౭ కోద్రవవృ ౧౦ ప్రియంగువృ ౧౬ యావనాళవృ ౧౭ శ్యామాకవృ ౧౮ రాజమాషవృ ౨ నీవారవృ ౧౬ శింబిధాన్యవృ ౧౮

### రవిచార ఫలము.

చైత్ర బ. షష్ఠీ గు. మేషేర్కః ౫౫-౮౨॥ సప్తమి ఈతిబాధల భయము. గురువారము అనుకూలమైన ధరలు మూల నక్షత్రము-శుభము పరిఘయోగ-ద్రవ్యనాశము। విష్టి పుష్టినాశము కుంభలగ్నము-ధరలు హెచ్చును రాత్రి-సస్యవృద్ధి క్షేమము ఆరోగ్యము సుభిక్షము। మఘాది దశకము విపత్తు।

ఆర్ద్రా ప్రవేశము:—ఆషాఢ శుతృతీయా బు. ఆర్ద్రా ౧ ర్కః॥ తృతీయా-సుభిక్షము। బుధవారము-సుఖము ధ్రువర్క్షము-అనుకూల ధరలు। వ్యాఘాతము యుద్ధభయము తైతుల సువృష్టి కర్కాటలగ్నము సుభిక్షము । . పూర్వాహ్ణము జగత్తుకు హాని। దివాభాగము-సస్యహాని ఆర్ద్రాది చతుష్కము ద్వితీయమండలము-అతి వృష్టి। లగ్న కేంద్రమున చంద్రస్థితి అతివృష్టి ప్రదము:—

### చంద్రచార ఫలము.

జ్యేష్ఠ శుక్ల ప్రతిపత్తు భానువారము:—దుర్భిక్షము, యుద్ధభీతి। రోగభీతి। సస్యములు మధ్యమములగును। ఆషాఢ శు. పంచమి శుక్రవారము:-శుభము। ఆషాఢ శుక్లమున స్వాతి దశమి నాడైయ్యెనా-అతి వృష్టి॥ ఆషాఢ బహుళమున రోహిణితో —ఏకాదశి యగుటచే మధ్యమము। ద్వాదశితో గూడి నుండుట సర్వసస్యహాని.

మరియు వైశాఖమున ౫ శనివారములు ౫ ఆదివారములును, జ్యేష్ఠమున ౫ ఆదివారములు, ఆషాఢమున ౫ మంగళవారములు, నిజ భాద్రపదమున ౫ శనివారములు, ఆశ్వయుజమున ౫ ఆదివారములు, కార్తికమున ౫ మంగళవారములు, పౌషమున ౫ శనివారములు, మాఘమున ౫ ఆదివారములు, ఫాల్గునమున ౫ మంగళ వారములను వైవవి.

శనివారము లైదగుచో జననాశము, దుర్భిక్షము, భూకంపము మొదలగు నుపద్రవములు గలుగును ఆదివారము లైదగుచో దుర్భిక్షము మంగళవారము లైదగుచో యుద్ధభయము, గలుగును.

### సౌరార్ఘములు.

మేష, వృషభ, మిథున, ధను, ర్మకర మాసములందు—యావనాళయాలకీ కుంకుమ హింగు కాంస్యతైల రండ గోధూమ కస్తూర్యాదులు శూన్యార్ఘములగును। ధాన్యాజ్య చణక వస్త్ర కర్పూర లవణ తామ్రకుంకుమ లవంగపుష్ప సీసాదు లత్యర్ఘములగును సువర్ణ రజత కార్పాసమాష ముద్గమరిచ నాగవల్లీ దళ తిల జీర జాజి పిప్పలి పట్టాదికాయస శ్రీగంధ క్రముక శర్కరాదులు సమార్ఘములగును। కర్కాటక కన్యామీన మాసములందు యావనాళాదులు సమార్ఘములు। ధాన్యాదులు శూన్యార్ఘములు। సువర్ణాదులు శూన్యార్ఘములు నగును.

### చాంద్రార్ఘలు

చైత్ర, జ్యేష్ఠ, శ్రావణ, అధిక భాద్రపద, నిజ భాద్రపద, కార్తిక, మార్గశిర, పౌషమాసములందు—యావనాళాదులు శూన్యార్ఘములు। ధాన్యాదు లత్యర్ఘములు। సువర్ణాదులు సమార్ఘములు। వైశాఖ, ఆషాఢ, ఆశ్వయుజ, మాఘమాసములందు—యావనాళాదులు। అత్యర్ఘములు। ధాన్యాదులు సమార్ఘములు। సువర్ణాదులు శూన్యార్ఘములు। ఫాల్గున మాసమున యావనాళాదులు సమార్ఘములు। ధాన్యాదులు శూన్యార్ఘములు సువర్ణాదు లత్యర్ఘములు నగును.

### మౌఢ్య నిర్ణయము

శ్రావణ శు ద్వితీయా గు. (21-7-55) ప్ర॥ శ్రావణ బ చతుర్దశి మం. (16-8-55) పర్యంతం గురు మౌఢ్యము. శ్రావణ బ తృతీయా శ (6 8-55) ప్ర॥ నిజ భాద్రపద బ. పంచమీ బు (7 9 55) పర్యంతం శుక్ర మౌఢ్యము.

### మకరసంక్రాంతి పురుషలక్షణము

అష్టకర్ణో విశాలాక్షో లంబభ్రూర్దీర్ఘ నాసికః। అష్టబాహు శ్చతుర్వక్త్రో స్సంక్రాన్తి పురుషస్స్మృతః॥ శతయోజన మున్నత్యం విస్తీర్ణం ద్వాదశస్మృతం । ఏవం రూపంహి విజ్ఞేయం సంక్రాంతి పురుషాకృతేః॥

ఈ మకరసంక్రాంతి పురుషునకు రాక్షసు పని పేరు దండాలు కరిష్ఠము। నిర్యలోకము చేష్టానము శుభము। పెసలక్షతలు-పెసలకు నాశము। రక్తవర్ణవస్త్రము - యుద్ధభయము। చందనము గంధము. ఆరోగ్యము। జాజిపూవుల ధరించుట కీర్తి వృద్ధి। నీలమాణిక్య మాభరణము. క్షేమము। రజతపాత్రలో పాయసమాహారము. రజతహాని, దుర్భిక్షము అరటి పండు - ఆరోగ్యము,



